శ్రీరస్తు.



శ్రీకృష్ణార్జునసంవాదంబను

# భగవద్గీతాయోగశాస్త్రము.



క॥ శ్రీకర యనసూయాత్మక । లోకాధిప వాసుదేవ లోక
స్తుత్యా । నాకేశార్చిత శ్రుతిచయ । సాకారప్రసిద్ధకాయ సా
త్త్వవతేయా ॥ వ॥ ధృతరాష్ట్రమహారాజువాక్యము ॥ సీ॥ సంజ
యు వినవయ్య సకలసౌఖ్యములచే భూమికినాభిమైపుణ్యమొంది।
విలసిల్లుచున్న యావిపులకురుక్షేత్ర మునను మదీయులునఘులై
న। పాండవేయులుఁగూడి బద్ధవిద్వేషులై సమరంబునకు వారు స
మతనొంది । యెద్దిచేసిరి యుద్ధమెట్లెట్లు మఱిచెల్లెనుత్సాహము
న వార్థియుఱుబలంబు । లెట్లువర్తిల్లె వానిని నేర్పఱించి। తెలియఁ
బలుకుము నాతోడ ధీవరేణ్య । వినఁగ వేడుకయయ్యె సవిస్తరము
గఁ । బ్రవిమలంబగు బుద్ధిచేఁబ్రబలమొంది ॥ వ ॥ అనినవినిసంజ
యుండిట్లనియె॥గీ॥ పాండవేయుల సైన్యములఁబాఱఁజూచి । నీకుమా
రాగ్రజుఁడు రాజనీరజాప్తుఁ । డడరియాచార్యుఁగనుఁగొని యధి
గమించి । పలికెనొకమాట యతనితో భక్తిమీఱ॥ గీ ॥ చూడు
మాచార్య వర్యయోశుద్ధహృదయ । పాండవేయులమహనీయభ
ద్రసేన । ద్రుపదసుతుఁడైన నీశిష్యుదోర్బలంబు। చేతశ్రేష్ఠతవర్తి
ల్లి చెలఁగుదాని ॥ గీ ॥ పాండవేయుల సేనలో భద్రకీర్తు । లనికిభీ
మార్జునులసములైనవారు । విరటుఁడును సాత్యకియు మహావిఖ్య

ల యశులు । ద్రుపదుఁడును యుధామన్యుఁడు నృపవరేణ్య ॥ వ॥ మఱియుధృష్టకేతుఁడును, చేకితానుండును, వీర్యవంతుండగు కాశిరాజును, పురజిత్తుండును, కుంతిభోజుండును, నరపుంగవుం డగు శైబ్యుండును ॥ గీ ॥ ఉరుబలుండగుయుయుధానుఁడుర్వినాథుఁ । డుత్తమోజుండు క్షాత్రకర్మోత్తముండు । ద్రౌపదీనందనులు సుభద్రాసుతుండు । విపులయశులు మహారథవీరులనఘ॥ గీ॥ నా మహాసేనయందలినాయకులను । నీవుగనుఁగొనుదువుగాదె నిర్మ లాత్మ । లైనవారల సంజ్ఞలునన్వయించి। చెప్పెదనువినుసుజ్ఞాన సిద్ధచరిత॥ గీ ॥ నీవుభీష్ముఁడుఁగర్ణుండునిపుణులనఘ। కృపుఁడుసమితిం జయుండును విపులమతులు । నీదుసుతుఁడువికర్ణుండు నీతియుతులు । సౌమదత్తిమహాయుద్ధశాలివినుము॥ గీ॥ వీరుగాకయనేకులువిపులయశులు । నాకుఁగా త్యక్తజీవితుల్ నయవిధిజ్ఞ । సర్వశస్త్రాస్త్రవేదులుశౌర్యయుతులు । యుద్ధరంగ విశారదులిద్ధ మతులు॥ గీ॥ అపరిమితమైన నా సేన నధికుఁడైన। భీష్ముచేఁబాలితంబయి పెంపుదనరుఁ । బరిమితంబైనవారలభద్రసేన । భీము చేరక్షితంబయి పేరువడయు॥ గీ॥ వీరలందునుమీరలువిపులబలులు మనమురణభూమివిడువకమసలుచుండి। భీష్మురక్షించుటయునాకుఁ బ్రీతిదాన । సర్వసేనలనాతఁడు సమతఁబ్రోచు॥ గీ॥ అంతహర్షంబువారలకంకురింపఁ । బంబిభీష్ముండు సింహనాదంబుచేసి। చిందమద్భుతరావంబు చెలఁగనూదెఁ । బోరుసూచనసేయుచుఁ బొలుపుమీఱ॥ వ॥ మఱియుభీష్మశంఖరావంబుతోడభేరుల, పణవంబుల, ఆనకంబుల, గోముఖంబుల, మహారావంబులుచెలంగి సమరఘోషంబుతుములంబయ్యె॥ గీ॥ అంతశ్వేతాశ్వములచేత నలరుచుండు । రథముపైఁగృష్ణపార్థులు ప్రథితయశులు । దివ్యకాం

షులచేతనుద్దీప్తులగుచు। శంఖములనూఁదిరత్యంత సంభ్రమమున ॥
గీ॥ పాంచజన్యంబు దేవకీపట్టియూదె। దేవదత్తంబునర్జున దేవుఁ
డూదెఁ। బౌండ్రమనియెడి మహాభీయభద్రశంఖ। మనఘువరభీముఁ
డద్భుతమలరనూదె॥ వ। మఱియునుననంతవిజయంబను దాని ధర్మ
పుత్రుండును, నకులసహదేవులు సుఘోషమణిపుష్పకంబులను
రావంబుచెలంగించిరి. తదనంతరంబ కాశీరాజును శిఖండియు
ధృష్టద్యుమ్నుండును సాత్యకియును శంఖంబులు పూరించిరంత ॥
గీ ॥ ద్రుపదుండును ద్రౌపదేయులున్నృపవరేణ్య। హరికి మేనల్లుఁ
డైన యాయనుపముండు। భద్రశంఖంబులూదిరిబంధురముగ ।
వేఱువేఱపరాక్రమ విపులులగుచు॥ గీ॥ అంతనారావమద్భుతంబ
గుటంజేసి। ధార్తరాష్ట్రులగుండెలు తల్లడిల్లె। భూమియాకా
శతలమును భోరుకలఁగి। చెలఁగిపరమేష్ఠిచెవులకుఁజిందరొదవె॥
వ॥ అట్టియెడనర్జునుండు॥ గీ॥ అచ్యుతునితోడనొకవాక్యమొనరఁ
బలికె। నిలుపుమో దేవ యిచ్చోటనిమిషమాత్ర। ముభయసేనల
నడుమ నీయుత్తరంపు। స్యందనంబాత్మసైనికానందనంబు ॥
గీ॥ వారలందఱనేఁజూడవలయువాఁడ। యుద్ధసన్నద్ధులైనట్టియు
ద్ధతబలుల। నాలమెవ్వరితోడఁజేయఁగవలెనో। యిమ్మహారణ
భూమిలోనిద్ధచరిత॥ గీ॥ ధార్తరాష్ట్రులబుద్ధిచేఁదగిలిమిగుల। న
తనిసంప్రీతికై వచ్చునట్టివారి। యుద్ధసన్నద్ధులైనట్టియోధవరులఁ।
జూచెదను నన్నుఁదోడరెడుశూరతతుల॥ వ॥ ఇట్లుకృష్ణార్జునుల
సంవాదంబుచెల్లెనని ధృతరాష్ట్రుతో సంజయుండు మఱియునిట్ల
నియె ॥ గీ ॥ అనఘుఁడర్జునువచనంబులాదరించి। వాసుదేవుండు
పాండవవత్సలాత్ముఁ। డుభయసేనలనడుమఁదానొప్పమీఱ। నిలిపి
రథరాజమపుడు దానిట్టులనియె॥ గీ॥ భీష్మకుంభజముఖ్యులఁబెంపు

మీఱు। సర్వరాజన్యవర్యులసమరవిదులఁ। గౌరవ్యులసైనికులనెల్లఁ
గలయఁజూడు। పార్థ రిపురాజ సంహర్త పాపహర్త॥ వ॥ అనినఁ
బార్థుండుకౌరవబలంబులంగలుగు తండ్రులఁదాతల నాచార్యుల
మేనమామలఁదోఁబుట్టువులఁబుత్రుల సఖులనుం గాంచె నంత ॥
గీ॥ మామలనుసుహృజ్జనములమఱియుమించి। యుభయసేనలలో
పలనుండునట్టి। సర్వబంధుజనంబులసకలసేన। నప్పుడంతంతఁజూ
చెనయ్యర్జునుండు ॥వ॥ఇట్లు చూచి॥గీ॥కృపమనంబున జనియింపఁగృ
ష్ణుతోడ। దుఃఖమున్నబలెఁ మాటలు తొట్రుపడఁగ। యోధజ
నములనావారినోనరఁగంటిఁ। గానఁజిత్తంబు సంతాపకలితమ
య్యె॥ గీ॥ అంగనిచయంబుడస్సెనోయప్రమేయ। ముఖముపాడె
ను జ్ఞానంబుమోసమయ్యె। దేహమునఁగంపమొదవెను దేవదేవ।
పులకతతులంకురించెను బూర్ణముగను॥ గీ॥ చేతిగాండీవమును
జాలఁజెదరఁజొచ్చె। దేహమునఁదాపమును జాలఁదేజరిల్లె। నిలు
వనోపనురథముపైనిర్వహించి। భ్రాంతిఁజెందెను మాటలు భ్రమ
సెమనము॥ గీ॥ ఘననిమిత్తచయంబులు గానఁబడియె। ఁబెక్కు
విపరీతములు గాఁగఁబెంపుదప్పి। కావునను లాభమేమియుఁ
గానఁబడదు। సమరముఖమున బాంధవసంహృతమున॥ గీ॥ కోర
నొల్లనువిజయంబుకోరికలర। రాజ్యకాంక్షనుబాసితి రాగమెడలె।
రాజ్యమొల్లను మిక్కిలిరమ్యమైన। భాగ్యమొల్లను బ్రతుకువైభ
వములొల్ల॥గీ॥ఏమహాత్ములకొఱకునై యీరణంబుఁజేసిరాష్ట్రం
బుఁగూర్పఁగఁజెలఁగినాఁడ। వారలేప్రాణధనములవాంఛలుడిగి।
యుద్ధసన్నద్ధులై మోలనున్నవారు॥ వ॥ వారెవ్వరంటేని, ఆచా
ర్యులును, పితృజనంబులును, పుత్రవర్గంబులును, పితామహులు
ను, మాతుల సమూహంబులును, పౌత్రులును, నితరులగు సం

బంధులును॥ గీ॥ వీరునమ్ములఁజంపెదు విమతులైరి। వీరిఁజంపంగఁ
త్రైలోక్య విభవమొప్పె। నేని నేనొల్ల నీ రాజ్యమేలు టెంత। వేదు
కైనను నాచేత వెలయఁగాదు॥ గీ॥ ధార్తరాష్ట్రులఁజంపుటతగి
నదైన। దీననాకును సంప్రీతి తెలియలేదు। దీనివల్లను బాపంబు
గాదెవారు। ధర్మవిద్వేషులై యాతతాయులైన॥ గీ॥ కులమునాశ
ముఁబొందించుకుతలభరము। బంధుజనముఁజంపెదు పాతకం
బు। లోభనిహతచేతస్కుఁడైలోలుఁడైన। హీనమతి కౌరవేశ్వ
రుఁడెఱుఁగఁడేవి॥ గీ॥ కులజబాంధవ హననంబు ఘోరమనుచు।
నెఱుఁగవలవదె మనకైననిద్ధచరిత। యెఱిఁగియెఱిఁగియు దీని నేనె
ట్లొనర్తు। (బాపవర్తనమర్హంబె ప్రాజ్ఞులకును॥ గీ॥ శాశ్వతంబ
గు కులధర్మసంచయంబు। చెడుఁగులక్షయ మొనరింప శేషతల్ప।
ధర్మమెడలినయప్పు డధర్మమొదవి। కులమునాశంబు నొందించుఁగు
వలయాక్షు॥ గీ॥ వినుమధర్మంబులే కడువిస్తరిల్ల। ధర్మవర్తులనడక
లుతప్పఁజేయు। ధర్మవర్తుల నడకలుతప్పినపుడె। వర్ణసాంకర్యా
మొదవును వరుసతోడ॥ గీ॥ వర్ణసాంకర్యకారులు వనజనాభ।
వంశహంతలు కల్మషవర్తనముల। వారిపెద్దలు నరకనివాసులగు
దు। రోలిఁబిండోదక క్రియాలోపమునను॥ గీ॥ వర్ణసాంకర్యమొ
నరించు వర్తనములఁ। బాతకంబులచేత నోపద్మనాభ। శాశ్వత
స్థితులే ప్రోద్దుఁజెందకుండ। జాతికులధర్మచయములు జాతిపో
వు॥ గీ॥ జాతికులధర్మములుమున్ను సమయనరులు। నరుగుదురు
నరకంబున కనుచునిటుల। ననఁగనేవిందుమున్నార్యజనముచేతఁ।
గృష్ణవిజ్ఞానమహిత నివృత్తతృష్ణ॥ గీ॥ ఇది మహాపాతకంబనిమది
నెఱింగి। యెట్లుగావింతునీకృత్యమేలసౌఖ్య। మనఘరాజ్యమ
హాలోభమనుసరించి। బంధుజనములఁ బొలియింపఁబాడియగు

నె॥గీ॥ ధార్తరాష్ట్రులు రణమునధూర్తులైన। శస్త్ర ధారులలో శస్త్రసమితిఁబాసి। యుండుటే నాకు సేమంబు నొదవఁజేయుఁ। జేరి వారేమిచేసినఁజేయనిమ్ము॥ వ॥ అనిమఱియు ధృతరాష్ట్రుని తో సంజయుం డిట్లనియె॥ గీ॥ పార్థుఁడిబ్భంగిహరితోడఁబలికెఁబలికి। శరముచాపంబు రథముపైఁజాఱవిడిచి। దుఃఖసంతప్తచిత్తుఁడై దుర్బలతను। స్యందనోపాంతముననుండెజడునిభంగి॥

గద్య.

ఇది, శ్రీసకలసుకవిజన సేవాపరాయణ,శ్రీమద్వ్యాసుదేవ ద్వాదశాక్షరీ మంత్రరాజ సిద్ధయోగ విద్యావిశారద, శ్రీనారదాదిగురుపరంపరావాప్త శ్రీవిష్ణుస్వామిసాంప్రదాయక ప్రతిష్ఠాపనాచార్యగురుకులతిలక యోగింద్రచూడామణి, శ్రీనృసింహదేవ గురువరేణ్య శ్రీపాదపద్మారాధక, వేముగంటిపురనివాస,ఆపస్తంబసూత్ర, హరితసగోత్ర, గాయమాంబా గర్భసంజాత, నాగోజీపండితపుత్ర, దత్తోజీపండిత ప్రణీతంబైన శ్రీకృష్ణార్జున సంవాదంబను భగవద్గీతాశాస్త్రంబునందర్జున విషాదయోగంబనునది ప్రథమాధ్యాయము.



శ్రీరస్తు.

## ద్వితీయాధ్యాయము.

వ॥ అనిమఱియు ధృతరాష్ట్రునకు సంజయుండిట్లనియె॥

ట్లుగావున సత్కృపయనుగమింప। నేత్రముల నశ్రుధారలు చిల్లఁ। జివుకుచుండెడునర్జునుఁజేరవచ్చి। పలికెనొకమాట దేవకిపట్టియపుడు॥ గీ॥ కశ్మలంబైన యీ దుఃఖకల్మషంబు। విషమసిద్ధమనార్యంబువిగతకీర్తి। స్వర్గదూరంబు నిన్నెట్లు సంశ్రయిం

చేఁ। భార్గవగభీరసంగర భయవిదూర॥గీ॥ పిఱికితనమింతనీమేనఁ
బెనఁగనీకు । తగదునీశౌర్యమునకిదిధైర్యశీల । హృదయదౌర్బల్య
మొదవించుహీనవృత్తి । విడచియుద్ధమ్మునకు లెమ్మువిమలచరిత॥
వ॥ అనినవినియర్జునుండిట్లనియె॥ గీ ॥ భీష్ముఁడును ద్రోణుఁడును
జాలఁబెద్దలనఘ। బాణజాలంబులను వీరిభండనమునఁ । బొదువఁ
గా నాకనుచితమే పుణ్యచరిత । పూజనీయులఁగేవలభూరియ
శుల॥ సీ॥ తగునయ్యవీరలఁదలఁకక తెగటార్చి యర్థకామమ్ములన
నుభవింప।వీరుమహాత్ములు విశ్రుతకీర్తులు బ్రహ్మవిద్యాతత్త్వపార
గులును। మహనీయతేజులమడియించి వీరల రక్తసిక్తంబైన రా
జ్యసుఖము । కుడుచుట యిదిమహా క్రూరకర్మముకంచెందకుక్రా
వె క్షత్రియధర్మమెడలి । లోకములనెల్లనావారు లోనుగాను। భి
క్షమెత్తిభుజించుట ప్రీతినాకు । దీనికంటెను శ్రేయంబుదేవతా
ర్క్ష్య । కలుగనేరదు చూడికఁగమలనాభ॥ సీ॥ కాదనవీరలు ఘ
నులొక్కో నాకంటె వీరికంటెను నేను విదితబలినో । వీరలగెల్తు
నో వీరలేనన్నునుగెలిచెడి వారలో కేవలముఁగ । వీరలు నాచేత
వెలయంగఁజత్తురో వీరిచేఁజత్తునో విధినియుక్తి । నీయుద్ధములలో
న నెయ్యది శ్రేష్ఠమో హితమెయ్యదియొనాకు నెఱుఁగఁబడదు ।
చంపరానట్టి ధృతరాష్ట్రజనవరేణ్య। పుత్రవర్గంబునాచెంతఁబో
రిలోన । యుద్ధసన్నద్ధులై నిల్చియున్నవారు। బంధుజనులకుఁ
గాని సంపదలుగలవె॥ గీ ॥ కృపణతను దోషముల బుద్ధిఁగీలుకొ
లుప। ధర్మమార్గంబు తెలియదేతత్త్వములను।శిష్యుఁడనునాకుఁదె
లుపవేసిద్ధముగను । నడుగుచున్నాఁడనిన్ను నే నంబుజాక్ష॥ వ॥ వి
నుము దేవదేవోత్తమా! ప్రధానపురుషా! రుక్మిణీవల్లభా! యి
ప్పుడు సంప్రాప్తంబైన మదీయశోకంబును దీనిచేతనైనయింద్రి

యదోషంబును మాన్పుకొనఁజికిత్స గాననేరను. నిష్కంటకం
బునుసకలసౌఖ్యోత్కర్షంబునునైన రాజ్యసుఖావాప్తియునత్యంత
సుఖకరంబగు దేవతాధిపత్యంబును గల్గిననైన నీదుఃఖనివృత్తికా
దనిపలికెనని నరనారాయణుల సంవాదంబు సంజయుండు ధృత
రాష్ట్రునితోడం జెప్పి మఱియునిట్లనియె॥గీ॥ఇట్లు హరితోడనర్జునుం
డెలమిఁబలికె। దేవదేవేశ శ్రీకృష్ణ దివ్యపురుష । యుద్ధమొల్లనుదీ
సికై యుత్సహింప। ననినిరుత్తరుఁడైయుండెననికిఁబాసి॥ గీ॥ అ
తనిఁజూచిసురాంతకుఁడచ్యుతుండు। పలికెఁజెఱునవ్వు మోమునఁ
జెలువుమీఱ। నుభయసేనలలోపలనూరకున్న। యర్జునునిపై గిరా
జన్యభర్జనునిని॥ వ॥ శ్రీభగవంతుండగు కృష్ణుండిట్లనియె॥ గీ॥ దుః
ఖపడరానిపనికేల దుఃఖపడెదు । ప్రజ్ఞలైనై నెఁబలికెదుప్రా
జ్ఞుఁబోలి । పొలిసిపోయెడు నట్టియుఁబోలియునట్టి । బాంధవులఁ
గూర్చిపండితుల్ భ్రాంతిపడరు॥ గీ॥ నాకుజన్మంబుమరణంబు న
రుఁడలేదు। నీకురాజన్య వరులకు నెఱయలేదు। ఇందులకుఁగాను
మదిఁజింతఁబొందనేల । చలనమొందుచు మదిలోనఁగలఁగనేల॥గీ॥
దేహికివరుసమానవ దేహమునకు । బాల్యయౌవనకౌమార
ఫలితమెట్లొ । యట్టులగుమాఱుదేహంబులందఁజూచి । ధీరులగు
వారు మోహంపుఁదెరువుచనరు॥ గీ॥ ఇంద్రియంబుల భోగంబులె
న్నియేని । దలఁపశీతోష్ణ సుఖదుఃఖములనుజెఱుచు । నాగమా
పాయులెయ్యవి యవియుఁదాల్చు । వానియందును మోక్షంబువ
రుసతోడ॥ గీ॥ చెడనిదదియని యెఱుఁగుముచిత్తమునను । సర్వ
సాక్షిత్వమునకెద్దిసమ్మతంబొ । యనఘసుఖదుఃఖరహిత బ్రహ్మం
బునకును । జేటులేశంబునెయ్యది సేయలేదు॥ గీ॥ అంతవంతము
ల్ దేహమ్ములనఘచరిత। జీవులెప్పుడునిత్యులై చెలఁగువార । లిది

యసిద్ధంబులనుకొను మిద్ధశౌర్య । మునను శస్త్రాస్త్రములు దాల్చి యచికితెమ్ము॥ వ॥ వినుము జీవుండొకనిచేతఁ జచ్చు ననుటయుఁ దాను నొకనిఁ జంపుననుటయు రెండును మిథ్యగా నెఱుంగుము ॥ సీ॥ ఆత్మయు నిత్యుఁడై యమరు నే వేళను జావఁడు దేహంబు చనెడి వేళ । సర్వరూపంబుల జనియించు నొక వేళఁ బుట్టి తాఁ గ్రమ్మఱఁ బుట్టుచుండు । నిత్యుఁడై యాత్మ దా నిలిచియుండియు ఖండ శాశ్వత మూర్తినై జరగుచుండు । సుఖదుఃఖముల చేతఁ జొప్పడకుండును కర్మంబులందును జడను పడఁడు । నాశరహితుఁడు నిత్యుఁడు నాకుఁ జూడ । నజుఁడు నవ్యయుఁడును నైన యమలపురుషు । నెఱిఁగి యీ జీవుఁ డెట్లొకో నేఁ చిచంపఁ దలఁచుచుండెడి మనుజుఁడు తత్త్వమెఱి॥ ఉ॥ కోకలు జీర్ణమైచనఁగ గొబ్బున వానిఁ బరిత్యజించి దా । శ్రీకర వస్త్రజాలములు చెల్వుగఁ దాల్చిన భంగి దేహిను । శ్లోకుఁడు జీర్ణ దేహముల శోభకు రోసిన జీవమూర్తియీ । లోకవుఁగొత్త లాంగముల లోలతఁ దాల్చును భద్రమూర్తియై॥ గీ॥ జీవుఁ డస్త్రంబు చేతనచ్ఛేద్యుఁడనఘ । యగ్ని దేవుని చేఁ గాల్పనను వుపడఁడు । ఉదకములు వీని నాన్పంగ నోపలేవు । వాయువులు శోషమొందింపవశము గావు॥ ఉ॥ ఛేదము నెందుఁ జెందఁడును జేడ్పడి పావకునందుఁ గాలఁడుఁ ఖేదము నొందకుండు మఱి కేవలశోషము వాఁడు గాఁడు స । మ్మోదియు సత్య వస్తువున మోఘతరస్థితి సర్వగుండునై । యాదియునై నయాతఁడును నై యచల స్థితినుండు నార్యుఁడై ॥ వ॥ మఱి యునవ్యక్తుండును నచింత్యుండును నై దేహంబు బాల్యయౌవనవృద్ధత్వంబులను వికారంబులం బొందు చందంబున వికారంబులం బొందని వాఁడు జీవుండట్టి జీవుని శరీరంబునం బ్రవర్తింపఁజేయు చేతనరిబున కేకాని కర్మఫలానుభవంబునకుఁ గర్తగాఁడని యెఱింగి తే

ని నీచేతఁజంపంబడు దేహంబులతోడఁజావఁడని శోకింపకుండుదు
వు॥ గీ॥పుట్టువాఁడును జీవుఁడేపొలియువాఁడు। జీవుఁడేయనిమది
లోనఁజేర్చితేని । చావుపుట్టువుగలిగిన జంతుతతికి। దుఃఖమొదవం
గ నీకేలతొట్రుపడఁగ॥ గీ॥ పుట్టినప్పుడె మృత్యువుపొందియుండుఁ।
జచ్చినప్పుడెజన్మంబు సంభవించు। దీనిమాన్పంగ బ్రహ్మాదిదేవతల
కు। వశముగాకుండు దీనికై వగవనేల॥ వ॥ వినుముశరీరంబులు జ
న్మాదికారణ స్వరూపంబులు మరణకాలంబున వెండియుఁగారణ
స్వరూపంబులగుటంజేసి వానియందు దుఃఖంబుదలంపవలదు॥
గీ॥ ఆత్మఁగొందఱువీక్షింతురద్భుతముగఁ । బలుకుదురు కొందఱ
ద్భుతంబలరుచుండఁ। గొందఱద్భుతమందఁగవిందురనఘ। యెవ్వ
రును నిశ్చయంబుగానెఱుఁగలేరు॥ గీ॥ జీవుఁడెప్పుడునిత్యుఁడై చె
డనివాఁడు।సర్వదేహాదికంబులసమతఁదగిలి। గానజీవాత్మలనుగూ
ర్చి కష్టపడఁగ। దుఃఖమందఁగనేటికిదోర్బలాఢ్య॥ గీ॥ యుద్ధధర్మం
బునియతిగాయుక్తినెఱిఁగి। కంపమందఁగనేటికిఁగలుషమనుచు ।
ధర్మయుద్ధముకంటెనుదగినశ్రేయ। మనఘక్షత్రియవరునకునరయ
లేదు॥ గీ॥ కోరకెంతయుఁదనుఁదానెకోరివచ్చెఁ । జెడనిస్వర్గసు
ఖోన్నతిచేరినట్లు।ధర్మయుద్ధంబుక్షత్రియతతికిఁగలుగ। సౌఖ్యమొం
దుదురనఘాత్మసకలనృపులు॥ గీ॥ కాననీధర్మసంగ్రామకాంక్షఁ
బూని। యుద్ధమిప్పుడుసేయకయుండితేని। నీదుధర్మంబుఁగీర్తియు
నీచమగును। పాపసంఘంబునీయందుఁబ్రాప్తమగును॥ గీ॥ అఖిల
భూతంబులునుభవదపయశంబుఁ। జాటునీలోకములయందుశౌర్య
ధుర్య। దుష్టకీర్తియొకించుకదొడరెనేని। చావుకంటెను ఘనమగు
సజ్జనులకు॥ గీ॥ రణముఖంబునను భీతుఁగారథికులెల్ల। నినుఁదలం
తురురాజన్యనివహమందు । వారిలోపల సమ్మానవృత్తిఁదనరి। లా

ఘువమునొందుటివి రాజలక్షణంబె॥ గీ॥ నీదుశాత్రవులిప్పుడునిన్నుఁ
జూచి। పరిహసింతురు పెక్కైనప్రల్లదములఁ। నిందఁజేయుదురెప్పు
డు నిపుణులగుచు। నింతకంటెను మఱిదుఃఖమేమిపార్థ॥ గీ॥ చచ్చి
తేనియుస్వర్గంబు సంభవించు। బ్రతికితేనియు రాజ్యంబు పరఁగఁగ
లుగుఁ। గానయుద్ధంబునందలి కలఁకమాని। లెమ్ముశస్త్రాస్త్రము
లఁబూని సమ్మదమున॥ గీ॥ సౌఖ్యమును దుఃఖమును రెండుసమ
ముచేసి। లాభనష్టంబులందును లక్ష్యమిడక। జయమపజయము స
మముగాఁజరపినీవు। రణముసేయుముపాపంబురాదుదీన॥ గీ॥ సాం
ఖ్యముత్తమమదినీకు జరగఁదేని। పూనియోగంబునందైనబుద్ధినిలుపు।
బుద్ధియోగంబుతోడుతఁబాదివితేని। కర్మబంధంబువిడుచుటగాం
తువనఘ॥ గీ॥ అట్టిధర్మంబునకు మఱిహానిలేదు। ప్రత్యవాయం
బుచీనిలోఁబడయకుండు। స్వల్పతరధర్మమనియెడు చండకరుఁడు।
పరగుసంసారతిమిరంబుపాయఁజేయు॥ గీ॥ కర్మమీశ్వరసంతృప్తి
గానొనర్చి। నతనిసద్బుద్ధియేకమైయలరుచుండుఁ। గామియైయో
గమెఱుఁగనికష్టజనుని। కనఘబుద్ధులు పెక్కులై యలరుచుండు॥
వ॥ మఱియు యోగరహితులై వేదంబులందుఁగర్మప్రధానంబు
గా వాదించువారు కర్మంబుకంటెనన్యంబులేదని పుష్పితంబులై
ఫలరహితంబులైనరీతి రంజకవాక్యంబులు పలుకుచుందురు॥ గీ॥ స్వ
ర్గపరుఁడైన కామిదాసంతతంబు। జన్మకర్మఫలంబులుజరగనిచ్చు।
నతులితంబైనయైశ్వర్యగతిగుఱించి। కర్మచయములు బహుళంబు
గానొనర్చు॥ గీ॥ భోగసంపన్నతాకాంక్షఁబారయునట్టి। పుష్పి
తాలోపనిర్గతబుద్ధులకును। నిశ్చలాత్మకమగుచు సంధిల్లుతెలివి। పు
ష్టనేరదుధ్యానవిస్ఫూర్తియందు॥ సీ॥ సత్వరజస్తమసంజ్ఞలఁదన
రారుత్రిగుణంబులను సమర్థించిచూడఁ। ద్రైగుణ్యవిషయమైతనరు

వేదంబులు కర్మంబులే యెంచుఁగలిగియుండుఁ। గాననిస్త్రిగుణ్య
కత్వంబుననుజెందు వేదోక్తములచేత వెలయకుండు।సంగ్రహద్వం
ద్వముల్ సమయించి మెలఁగుము కర్మఫలంబుల కాంక్షమాను।ని
త్యమును సత్వసంపదనిలిచియుండు। పొందరానివిగోరకుపొందఁ
బడిన । యర్థములయందు సంతోషమందనీకు । మప్రమత్తుఁడవై
యుండుమనుదినంబు॥వ॥వినుము సకలనదులనువాపీకూపతటాకం
బులనుగలుగునఖిల స్నానానుష్ఠాన ఫలంబులు నొక్క-సముద్రంబు
నంగలుగు చందంబున వేదంబులయందుఁగలుగు సర్వకర్మఫలంబు
లును హృదయంబున బ్రహ్మావలోకనంబు సేయుయోగీశ్వరునకు
సంభవించు ॥ గీ॥ కర్మములుసేయనోపెడుఘనుఁడవేని । కర్మఫ
లములపైవాంఛగలుగనీకు। ఫలములొనరించుకర్మంబుపట్టువదలు।
కర్మమొనరించు తత్ఫలకాంక్షవిడిచి ॥ గీ॥ యోగముననుండి
కర్మంబులొప్పఁజేయు । కర్మసంగంబువిడవాడి ఘనతమీఱి ।
కర్మసిద్ధులులేకున్నఁగలిగియున్న । సమతవర్తిల్లుపురుషుండు
సాంఖ్యయోగి ॥ గీ॥ బుద్ధియోగంబుచేతను బొలుపుమీఱి । దూ
రములుగాఁగఁగర్మముల్ ద్రోచిపుచ్చి । ఫలముకాంక్షించువా
రలు బహుళముగను । దైన్యమును బొందుచుందురుమాన్యచ
రిత ॥ గీ ॥ బుద్ధియోగంబుచేతనుబొలియఁజేయు । సుకృతము
నుదుష్కృతమురెంటి శుద్ధహృదయ । కర్మములకౌశలంబె యో
గంబనంగఁ। గానయోగంబుమదిలోనఁగాంచుమనఘ॥గీ॥ కర్మఫల
మునుదెగఁగోసికాంక్షవాసి । బుద్ధియోగంబు చేతను బొదలువా
రు। జన్మబంధంబులందునుజడతపడక। చెడనివైష్ణవపదవినిజెందు
వారు ॥ గీ ॥ ఇప్పుడైనను నీబుద్ధితప్పఁబడక । మోహకలితంబు
దాటునమ్మోదమహిమ। యపుడువిడుతువుపార్థ వేదార్థతతుల।

విన:గ:దగియున్నవానినివిన్నవాని ॥ గీ ॥ తలఁచులౌకికవైదికార్థ
ములచేత । నధికవికలతఁబొందినయట్టిబుద్ధి । విపులబుద్ధి సమాధి
యాందెపుడునిలుచు। నప్పుడేయోగసంప్రాప్తినందఁగలవు॥ వ॥ అ
నినవినియర్జునుండిట్లనియె ॥ గీ ॥ప్రాజ్ఞుఁడనియెందుచేతనుబలుకఁ
బడును। నాతఁడెట్లుసమాధియందలరుచుండుఁ । బలుకునెయ్యది
బుద్ధిసంపన్నుఁడగుచు । నెచటఁగూర్చుండు నెచ్చటికేగుచుండు ॥
వ ॥ అనినవిని భగవంతుండిట్లనియె ॥ గీ ॥ మనసులోపలికోర్కె
లుమగుడఁబెట్టి । యాత్మచేతనుబ్రహ్మంబునలరఁజూచి । సంతసం
బందునెవ్వఁడుసంతతంబు। ప్రజ్ఞ వానిలోఁగలదనిపలుకఁబడును॥
గీ ॥ అనఘవినుకూర్మమంగంబునడఁచినట్ల । యింద్రియంబులవిష
యేచ్ఛనెగరనీక । మనముమథియింపనేర్చినమహితయశులు । ప్ర
జ్ఞవారనితెలియుముపార్థనీవు ॥వ ॥ వినుము నిరాహారునకు విష
యానుభవ సామర్థ్యంబులేకయుండియు నభిలాషంబుమానదు :
చందనాది భోగరహితుండయిన దేహికి నింద్రియనిగ్రహంబు వ
లనభోగంబులేనివర్తించుఁగానికాంక్షనివర్తింపదు; బ్రహ్మావలోక
నంబు గలిగినయోగికి నకాంక్షంబుగ విషయనివర్తనంబగుంగాని॥
గీ ॥ మనము యోగంబుతోఁగూడమసలఁజేసి। యింద్రియంబుల ని
యమింపనెఱుఁగకున్న । మనము నాయింద్రియంబులె మగుడఁబ
ట్టు । నింద్రియంబులు దుష్టంబు లింద్రపుత్ర ॥గీ ॥ దుఃఖమొదవిన
వేళలఁదొట్రుపడక । సుఖముఁజెందినవేళలసొక్కిపడక । పర
గసుఖదుఃఖములరెంటభవ్యమతిని । బలుకఁటుండెడువాఁడె ప్రోప్రా
జ్ఞుఁడనఘ ॥ గీ ॥ కాననింద్రియచయములఁగట్టుపఱచి । మనము
నామూర్తియందునమఱుఁగుచేసి । యింద్రియంబులతోఁగూర్పనె
ఱుఁగువానిఁ । బలుకుదురులోకులెల్లను బ్రాజ్ఞుఁడనుచు ॥ గీ ॥ విష

యములయందుసంప్రీతివిడువఁడేని । వానియందును సంగంబువరు
సఁబుట్టు । సంగమునఁజేసికామంబు సంభవించుఁ । గామమునఁ
గ్రోధమప్పుడే కలుగుననఘ ॥ గీ ॥ క్రోధమునఁబుట్టు మోహంబు
కొంతలేక । మోహమునఁబుట్టువిస్మృతిముందుగాను । స్మరణ
వికృతిని బుద్ధికిఁబరగుహాని । బుద్ధినాశంబు వలననే పొలిసిపోవు॥
గీ ॥ రాగవైరంబులందును రాగిగాక । విషయములనింద్రియముల
తోవేఱుచేసి। బ్రహ్మమందునజీవునిఁబాదుకొలిపి। బ్రహ్మకృపనుము
ముక్షుండు పడయుఁబార్థ ॥గీ॥ అమ్మహాత్మునికరుణచే నఖిలదుఃఖ।
హానిగావునదుఃఖంబులడఁచుపార్థ । మనముమఱిసుప్రసన్నతమ
సలెనేని । బుద్ధియాతనిలోపలఁబాదలుచుండు॥ గీ॥ యుక్తచిత్తుఁ
డుగాకున్ననుడుగుబుద్ధి । బుద్ధిలేకున్న భావనపొలిసిపోవు । భా
వనాశూన్యునకుశాంతిపరగలేదు । శాంతిలేకున్న సౌఖ్యంబుజర
గకుండు ॥ ఉ ॥ కావుననింద్రియార్థములుగైకొని చిత్తమువాని
తోడనే । పోవఁగయోగమార్గమును బొందఁగనొల్లనివాని ప్రజ్ఞ
యుక్। నావపయోధి మధ్యముననాటఁగవాయు వశంబునన్వడిం।
బోవుచుఁదాను గీడ్వడెడుపోలిక యశోధనకీడ్వడుంజుమీ॥శీ॥ కా
వుననునింద్రియంబుల కాంక్షలందుఁ । బొందనీయక కుదియించి
భూరితేజుఁ।డెల్లలోకంబులందుఁదా నెన్నఁబడును । ప్రాజ్ఞ జన
ములలోపలఁబ్రాజ్ఞుఁడనుచు ॥వ ॥ మఱియు యోగీశ్వరునకు సం
సారులగు మూఢులువర్తించుదివంబు నంధకారంబైనరాత్రిమై
తోచు; సంసారిజనంబులు సకలంబు నివర్తించినిద్రించునారాత్రి
యోగివరేణ్యునకుదివంబైయుండు॥ మత్తకోకిల॥ సర్వమైనసరిచ్ఛ
యంబునుసంశ్రయించి వసింపఁగా । నిర్వహించిచలించకుండెడె
నీరధింబలె యోగియుక్।సర్వకామచయంబుఁదన్నును సంశ్రయిం

చినదానిచే। దుర్వికారుఁడుకాఁడు కామికి దూరమీస్థితియర్జు
నా॥ గీ॥ కామచయమును దెగఁగోసి కలఁకఁబాసి। నిత్యుఁడగువి
ష్ణుమూ_ర్తిని నిలిపిమదిని। మమతఁబాసి యహంకారమహిమరో
సి।చెలఁగుపురుషుఁడుకాలునిఁజెందుఁబార్థ॥గీ॥ఇట్లుబ్రహ్మానుభవము
చేనేపుమీఱి। మగుడిసంసారమోహంబుమరగ కెపుడు। దీనిమర్మం
బునెంతైనఁదెలిసెనేని। బ్రహ్మనిర్వాణ మొందునుబాండవేయ॥

ఇది సాంఖ్యయోగంబను ద్వితీయాధ్యాయము.

---

## తృతీయాధ్యాయము.

వ॥ అనినవిని యర్జునుండిట్లనియె॥ గీ॥ కర్మములకంటెమి
క్కిలి కమలనాభ। శ్రేష్ఠమగుబుద్ధి యంచును జెప్పితీవు। అయి
న హింసానిమి_త్తకమైనయట్టి। యుద్ధకర్మంబు నియమింపయు_క్త
మగునె॥ గీ॥ సందియంబైన మాటలుచాలఁజెప్పి। బుద్ధిచలనం
బుఁగావింపఁబోలునయ్య। కర్మబుద్ధులలోపల ఘనతరంపు।
శ్రేయమెయ్యది నాతోడఁ జెప్పుమయ్య॥ వ॥ అనినవిని శ్రీభగ
వంతుండిట్లనియె॥ గీ॥ జ్ఞానయోగంబుచేతనుసాంఖ్య పరులుఁ।
గర్మయోగంబు చేతను గర్మపరులు। సిద్ధిఁబొందుటనేమున్న చె
ప్పినాఁడ। లోకమున రెండునిష్ఠలు ప్రాకటముగ॥ గీ॥ క
ర్మములుమానినంతనె గలుగునెట్లు। జ్ఞానసంప_త్తి నరునకుమా
ననీయ। యాత్మసంశుద్ధి లేని సన్యాసమెట్లు। మోక్షమియ్యంగ
నేర్చును మోహదూర॥ వ॥ వినుముప్రకృతి జాతంబులగుగుణం
బులచేతంబ్రవ_ర్తించు పురుషుండు క్షణంబును గర్మంబుసేయకుం
డుటకు సమర్థుండు గాఁడు; కావునగుణవశుండై కర్మంబులుసే
యుచుండు॥గీ॥ కడఁగికర్మేంద్రియంబులఁ గట్టుపఱిచి। మనము

బ్రహ్మంబునందు నమర్చికట్టి । విషయములయందుఁ బరగించి
వెలయువాని । దాంభికాచారుఁగా మదిఁదలఁపుమయ్య॥ గీ॥ ఎవ్వఁ
డేనియు నెవుడుజ్ఞానేంద్రియముల । మనముచేతనుమిక్కిలి మట్టు
పఱిచి। యాశనొందక కర్మేంద్రియములచేత । సంచరింపుచునుం
డునాజనుఁడుయోగి ॥ గీ ॥ సహజకర్మంబువిడువక సకలమయిన।
కర్మలొనరించుటే మేలుకర్మరహితుఁ । డైప్రవర్తించుకంటె దే
హంబునడపఁ । గర్మహీనునకువశంబుగాదుగాన ॥ గీ ॥ విష్ణుఁ
గూర్చి కర్మంబులు వెలయఁబార్థ। యితరకర్మంబు బాధకహేతు
వగుట। విష్ణుఁగూర్చి సుకర్మంబు విమలమతిని । ముక్తసంగుఁడవై
చేయు మఘుఁగుపడక॥ గీ॥ యజ్ఞములచేతఁబ్రజలఁదానలరఁజేసి।
బ్రహ్మదేవుఁడువారితోఁబలికెననఘ । యజ్ఞములుసేయుఁడీ మీరల
తులమైన। ఫలములిచ్చును గామధుక్ప్రీతిమనదియు॥గీ ॥ దీనివలన
ను దేవతల్ తృప్తినొంది। దేవతావలిమీకును దృప్తిఁజేయు। నటు
లనన్యోన్యతృప్తులై యహరహంబు। పరగశ్రేయస్సుఖావాప్తిఁబడ
యఁగలరు॥ గీ॥ దేవతలుయజ్ఞములచేతఁదృప్తినొంది । వృష్టిముఖ
మునఁదృప్తిఁగావింతురనఘ। సౌఖ్యములఁబొందివారికిష్టంబులిడక।
కుడుచువారలు దొంగలు కువలయమున॥ గీ॥ యజ్ఞశేషంబు భుజి
యింపయజ్ఞపరుఁడు। దోషములవల్లఁగూరుఁడై తొలఁగియుండు।
యజ్ఞశేషంబులేని యాహారభోక్త । దుష్టతమకిల్బిషంబులఁదొడరి
కుడుచు॥ గీ॥ అన్నములచేతనే ప్రాణులైనవార । లన్నములవల్ల
నే తృప్తియంకురించు । యజ్ఞములవల్ల వర్షంబులడరికురియు ।
యజ్ఞములు వర్షములవల్లనలరఁబుట్టు॥ గీ॥ కర్మములుబ్రహ్మవల్లను
గలిగెనట్టి। బ్రహ్మయక్షరునందును బ్రభవమయ్యె । నక్షరబ్రహ్మము
న్నిటనధిగతంబు। గాన బ్రహ్మైక్యజీవతఁగాంచవలయు॥ గీ॥ బ్రహ్మ

సంతృప్తిచేతనుబరగునెవ్వ॥డాత్మలో౯బ్రహ్మసంతృప్తినలరునెవ్వ॥డట్టివానికిసాధ్యంబులరయలేవు । బ్రహ్మపదమందుటతనికిఁ బ్రస్ఫురితము ॥ గీ ॥ అతఁడుధర్మంబుఁజేసిననర్థమొందఁ । డతఁడుసేయకయుండిననఘముఁజెందఁ । డతనికాశ్రయణీయులు నరయలేరు । దేవదానవవరులాది తెల్లముగను ॥ గీ ॥ కానసక్తస్వభావంబుఁబూనకీవు । కామ్యకర్మంబుసేయుము కలఁకఁబాసి। సక్తమతిగాకకర్మముల్సలుపుపురుషుఁ । డనఘమోక్షపదప్రాప్తినలరుచుండు॥వ ॥ వినుముకర్మంబుఁజేసియకాదె జనకాదులుజ్ఞానసిద్ధింబొందుట; నీవునులోక సంగ్రహణార్థంబుకర్మంబు సేయుము॥ గీ॥ శ్రేష్ఠులగువారలెయ్యది సేయుచుందు। రనఘయితరులునాకర్మమాచరింతు। రదిప్రమాణంబుగాలోకమనుసరించుఁ। గాననీవునుగర్మంబుకడఁగిచేయు॥ గీ॥ నాకుఁగర్తవ్యలేశమెన్నఁడునులేదు । పొందఁబడి నదినైమీఁదఁబొందఁగలవు । మూడులోకంబులందునుముఖ్యచరిత। యట్టిదైయుండికర్మమే నాచరింతు॥ గీ॥కర్మములునేనుజేయకకడపితేని। కర్మచయములుసేయమిగలుగుఁబ్రజకు। ననఘనామార్గమంతయుననుసరించి। యఖిలజనములునడుతురియ్యవనిలోన॥ గీ॥ నేనుగర్మంబుసేయక నెగడుచున్నఁ। గడఁగిలోకంబువర్ణసంకరమునొందు । వర్ణసంకరమొనరించువాఁడనేనె। యగుదుదాననెలోకంబుహానిఁజెందు॥ గీ॥ సక్తుఁడైకర్మములఁజేయుజడునిభంగి। యోగయుక్తుఁడుకర్మంబులొనరఁజేయు । లోకసంగ్రహణార్థమైలోకమునను । దానసక్తతనొందియుఁదఱుచుగాను॥ గీ॥ జ్ఞానసంపన్నుఁడజ్ఞానసహితులకును। బుద్ధిభేదంబుమవమునఁబొందనీక। వారితోఁగూడఁగర్మముల్ వరుసఁజేసి। వారివిజ్ఞానులనుజేయువరుసతోడ॥ వ॥వినుముప్రకృతిగుణంబులైనసత్వా

రజస్తమంబులచేతఁజేయఁబడినకర్మంబులకునహంకారవిమూఢా
త్ముండు తానకర్తఁగాఁదలంచు మఱియును॥గీ॥కడఁగిగుణకర్మము
లకుఁదాఁగర్తగామిఁ।దత్త్వసంవేదియెప్పుడుఁదలఁచుచుండు। నన
ఘుయింద్రియములు విషయంబులందు। నహరహంబునువర్తించున
నితలంచు॥ గీ॥ ప్రకృతిగుణములచేతనుబద్ధులగుచుఁ। గర్మములుసే.
యనేప్రౌఢుఁగడఁగువారి। యోగసంపన్నుఁడైనట్టియోగిజనుఁడు।
నిందసేయఁడుకర్మంబునీచమనుచు ॥ వ॥ కావున ॥ గీ ॥ బ్రహ్మసం
ధానపరుఁడవైభావమునను। గర్మమునునాకునర్పణగానొనర్చి ।
యాశమమకారమునుబాసియనఘచరిత। యుద్ధమొనరింపుసంతా
పముడుగుదీన॥ గీ॥ ఇదిమొనామతమిందునవెవ్వరేని। చేయకుందు
రుశ్రద్ధానసూయలొదవ। నట్టిపురుషులుకర్మంబులడలఁజేసి । ము
క్తిగాంతురుసంసారమోహముడిగి॥ గీ॥ శ్రద్ధలేకయసూయచేజడ
తనొంది।యెవ్వఁడేనియునిమ్మతమెఱుఁగకుండు।నతఁడ విజ్ఞానమూ
ఢుఁడైయహరహంబు।యోగమునఁగష్టుఁడగుననియొనరఁదెలియు॥
వ॥ వినుముపూర్వకర్మస్వభావంబు ననుసరించి జ్ఞానవంతుఁడు
ప్రవర్తించునిఁకనజ్ఞుండన నెంతసకలభూతంబులు పూర్వజన్మకర్మ
స్వభావానుసారులుగావుననింద్రియనిగ్రహంబువారలనేమిసేయు
నదియునుంగాక॥గీ॥ ఇంద్రియార్థంబులవలననింద్రియముల। కనఘ
రాగంబుద్వేషంబునంకురించు । రాగవిద్వేషములయందురణిమగు
డ్పు।వలయు నవిమోక్షకాంక్షికివైరులరయ ॥వ॥ వినుముతెల్లంబు
గాఁజేయంబడేన యహింసారూపంబైన స్వధర్మంబుకొంచెమయి
నను శ్రేష్ఠతరంబదియెల్లనినస్వకీయంబైనక్షత్రధర్మంబునమృతుండ
వైనను స్వర్గంబునందఁగల విదిమానవధర్మంబు. అహింసనవలం
బించితేనినరకంబుఁబొందఁగలవనినవిని యర్జునుండిట్లనియె॥గీ॥పా

పఘ్నొల్లకచరియించు బ్రహ్మవిముఁడు। నొకరుఁడెడఁ బాపమొనరిం
చునుర్విలోన। నిట్టిదుష్కర్మమునకును హేతువెద్ది। వృష్ణికులవర్య
చెప్పుమువివరముగను॥వ॥అనిన భగవంతుండిట్లనియె॥గీ॥ ఎద్దికా
మంబుఁగ్రోధంబునెన్నఁగాను। నదియు రాజసగుణమునసంకురిం
చుఁ। బరగబహ్వాశి కేవలపాపరాశి। దీనిశత్రువుగా మదిఁదెలి
యుమలయు॥ గీ॥ అధికతరధూమ సమితిచేనగ్నిఁబోలెఁ। దఱుచు
మలినతచేత నద్దంబుఁబోలెఁ। బ్రబలమగుమావిచేతగర్భమును
బోలె। ననఘకామంబుచే జ్ఞానమావృతంబు॥ గీ॥ పరతరజ్ఞానము
నకునావరణమైన। కామమెప్పుడు జ్ఞానికిఁగఠినవైరి। జ్ఞాని నేమిటఁ
బూరింపఁదరముగాదు।వినుముశోషంబునొందించుననలుమాడ్కి॥
వ॥ మఱియుఁగామంబుతనకధిష్ఠానంబయినమనోబుద్ధీంద్రియంబు
లచేత జ్ఞానసంపన్నువిజ్ఞానంబునకు నావృతంబై మోహంబునొం
దించు॥ గీ॥ కానదుర్మోహసంప్రాప్తికాకమున్నె। యింద్రియంబు
లనియమింపుమీవుపార్థ। జ్ఞానవిజ్ఞాననాశకమైనయట్టి। కలుషతర
కామశాత్రవు గెలువఁగలవు॥ గీ॥ ఇంద్రియంబులుతనువునకెక్కు
డనఘ। యింద్రియంబులకంటెను హెచ్చుమనము। మనముకంటె
ను సద్బుద్ధిమాన్యతరయ। బుద్ధికంటెను జీవుండుభూరితముఁడు॥
గీ॥ ఆత్మబుద్ధికిఁగడునెక్కుడనియెఱింగి। మనమునింద్రియములతో
డనుగుడఁబట్టి। కామమనెడుదురాసదకష్టరిపుని। గెలువుమర్జున
బుద్ధిచేఁగేవలముగ॥

ఇది కర్మబ్రహ్మయోగంబను తృతీయాధ్యాయము.

## చతుర్థాధ్యాయము.

వ॥ అని మఱియు భగవంతుండిట్లనియె॥ క॥ ఈ యోగము నే సూర్యున । కాయతమతిఁ జెప్పినాఁడ నాతఁడు మనువ । కీ ధీయుతు నకుఁ జెప్పెను మను । వాయిక్ష్వాకునకుఁ జెప్పె నాశ్చర్యముగ ॥ వ॥ పరంపరాప్రాప్తంబైన యిమ్మహాయోగంబు నిమిప్రభృతులయిన రాజర్షు లెఱుంగుదు రిప్పు డిది బహుకాలంబయ్యెం గావున నిగూఢంబై యున్న యది॥ క॥ సారసహితునకు మును నే । నారూఢిగఁ జెప్పినట్టియా యోగంబే । పో రాని సఖుఁడవగుటను । జేరి రహస్యోత్తమంబుఁ జెప్పితిఁ జుమ్మీ॥ వ॥ అనన ర్జునుండు ॥ క॥ హరినీ జన్మము కంటెను । నరయంగా సూర్యజన్మ మంతకు మున్నే । పరికింప యోగ మెటువలెఁ । దిరముగఁ జెప్పితివి నాకుఁ దెలుపుము కృష్ణా॥ వ॥ అనిన విని భగవంతుఁ డిట్లనియె॥ గీ॥ జన్మములు పెక్కు నాకును జనియె వెనుక । జన్మములు పెక్కు నీకును జనియె వెనుక । నెన్ని జన్మంబు లన్నియు నెఱుఁగుదేను । నీవెఱుంగవు మాయచే నిక్కముగను ॥ గీ ॥ అజుఁడనయ్యును మఱియు నవ్యయుఁడ నయ్యు । సర్వభూతమ్ములకు నేనె స్వామినయ్యు । నాత్మ యైనట్టి ప్రకృతి నే నాశ్రయించి । మహి జనింపుదు నాదగు మాయచేత ॥ గీ ॥ ఎప్పు డెప్పుడు ధర్మంబు లేపుదప్పు । నెప్పు డెప్పుడు ధర్మంబు హెచ్చిచెల్లఁగు । నప్పు డప్పుడు నన్ను నే నవనిమీఁద । సంభవింపంగఁ జేయుదు సాధువర్య॥ గీ॥ సాధుజనముల రక్షింతు సత్యయుక్తి । దుర్జనాదులఁ ద్రుంతు ముదుదోర్బలమున । ధర్మనిర్వాహకత్వంబుఁ దగిలి నేను । సంభవింపుదుఁ బ్రతియుగసమయమునను ॥ వ ॥ వినుము వీతరాగభయక్రోధులును మదేకచిత్తులును మదుపాశ్రితులును జ్ఞానతపంబులచేతఁ బవిత్రులునై మద్భావంబు నొందినవారలు పెక్కండ్రు గలరు. ॥ గీ ॥ ఎవ్వఁ డెటువలె నన్నుఁ దా నెఱిఁగి కొలుచు । న

ట్టిపురుషుని నేనట్టులనుసరింతు । సర్వదేవాత్మకుఁడఁగాన సకలదే
వ। పూజనంబునునను వచ్చిపొందుఁబార్థ॥ వ॥ ఈలోకంబునఁగర్మ
సిద్ధి వేగంబయగుటంజేసి సకలజనంబులును దానినపేక్షించి కర్మ
సిద్ధిప్రదములయిన దేవతలనారాధింతురుగావున ॥ గీ॥ నాదుజన్మం
బుఁగర్మంబు నైష్ఠికతయు। నెవ్వఁడేనియు నిజముగా నెఱుఁగునతఁడు।
దేహనిర్గతుఁడై మఱి దేహములను। బొందకుండును మఱినన్నుఁబొం
దియుండు॥ వ॥ మోక్షప్రదుండనగు నన్ను సాక్షాత్కారంబుగా సే
వింపనోపరు మోక్షంబు చిరకాల సాధ్యంబుగావున॥ గీ॥ వర్ణము
లనేనయుత్పత్తి వరుసఁజేసి। కర్మగణములు విభజించి కలిపినాఁడ।
వానికేఁగర్తనయ్యును వరుసతోడ। నవ్యయస్థితిఁగర్తగాకలరుచుం
దు॥ గీ॥ కర్మములయందురిక్తుఁడఁగాన నేను। కర్మఫలములనాకు
నుగాంక్షపుట్ట। దిట్లుగా నన్నెఱింగెడు సిద్ధజనులు। కర్మములచేత
బద్ధులుగారు పార్థ॥ గీ॥ మొగినహంకార రాహిత్యమున నొనర్చు।
కర్మములు బంధహేతువుల్ గావు గానఁ। బురుషులైన ముముక్షులు
పూనునట్టి। పూర్వతరకర్మములు నీవు పూనఁగఁజేయు॥ గీ॥ కర్మమె
య్యది కర్మము గాని దెద్ది। యనుచు సుజ్ఞానులును మోహమునఁజరిం
తు। రెద్ది చేసిన నశుభంబు లెల్లఁబాయు। నట్టి కర్మంబుఁదెలిపెదనన
ఘచరిత ॥వ॥ వినుము కర్మంబులఁజేసినఁజేయకుండినఁబాపంబగు
బ్రహ్మచారి గృహస్థ వానప్రస్థులకు యాహ్నికోక్తంబులైన స్నా
నాద్యనుష్ఠానంబు లనుకర్మంబులు చేసిన ఫలరాహిత్యంబును జే
యకుండిన నఘంబును నగు యజ్ఞాన్న దానాది కర్మంబుల స్ఖలితత్వంబు
న మోక్షంబును స్ఖాలిత్యంబున నప్రత్యవాయంబును నగు సన్న్యాసా
దులనునట్టివియు బ్రాహ్మణులకు లెస్స తెలియందగినవిగావునఁగ
ర్మగతిగహనంబు ॥ సీ ॥ వేదోక్తములచేత వెలసెడివారల కర్మ

ములఁ దనకవిగాదటంచు । వేదోక్తములచేత వెలయంగనొల్లని
యజగర జడభరతాదియోగ । పరులకర్మంబులవరుసబాలోన్మ
త్తపైశాచకంబులఁబరగునవియు । దనకుఁగర్మములుగాఁధరియిం
చిమహిలోన వైష్ణవధ్యానంబు వదలకున్న । యతఁడుసద్బుద్ధియు
తులయందధికతముఁడు । నతఁడుసత్కర్మచయముల నవనియం
దుఁ। జేయకయుఁజేసియుల రెండుశిష్టతముఁడు । నతఁడెపో యోగి
వర్యుఁడునవనిలోన ॥గీ॥ కర్మములలోన నెప్పుడుఁగలిగియుండు ।
కామసంకల్పములఁ జాలఁగడకుఁద్రోచి । జ్ఞాననిర్దగ్ధకర్ముగుఁడైన
వాఁడు । పండితుండనిబుధులచేఁబలుకఁబడును॥ గీ॥ కర్మఫలముల
సంగతికడకుఁద్రోచి। యీశ్వరధ్యానసంగతి నెసఁగఁజెంది । య
హరహంబునిరాశియునగుజనుండు । కర్మములుచేసినైనను గ
ర్మిగాఁడు॥ గీ ॥ ఆశలుడిగినఁగర్మయోగీశుఁడనఘ । విగతసర్వప
రిగ్రహుండగుచునుండి । దేహకృతకర్మములచేతఁ దిరిగనేని । క
ర్మకిల్బిషలిప్తుఁడుగాఁడుపార్థ ॥వ॥ కావునయదృచ్ఛాలాభసంతు
ష్టుండును, సుఖదుఃఖకృత్యంబువలన నగుహర్షశోకంబులనొం
దనివాఁడును, విగతమత్సరుండును, గోరికలుసిద్ధించనియెడసమ
వర్తియునగు మహాత్ముండు కర్మంబులఁజేసిననేమిబద్ధుండుగాఁడు॥
క ॥ గతసంగుండును ముక్తుఁడు । మతిసుజ్ఞానస్థితుండు మానిత
యజ్ఞా । న్వితకర్ముఁడునిర్వాణో । న్నతియుక్తుఁడుఁగర్మిగాఁడు
నవ్యవిచారా॥వ॥ఇట్టిమహాయోగీశ్వరుఁడు తర్పణంబందు బ్రహ్మం
బును నగ్నియందు బ్రహ్మంబును హోమంబులందు బ్రహ్మంబు
నుంగా నిరీక్షించి తనయిందుఁగలుగుబ్రహ్మంబు సర్వగతంబుగాఁ
దెలిసి యాకర్మంబునబ్రహ్మనిర్వాణంబునొందు॥ గీ ॥ కర్మయజ్ఞం
బుదేవతాకలితమగుచు । బ్రహ్మభావన శూన్యమైపరగుచుండు ।

యోగయజ్ఞంబు బ్రహ్మసంయుక్తమగుచు । బ్రహ్మభావనపూర్ణ మైపరగుచుండు ॥ వ ॥ మఱియునుంగొందఱు యోగసిద్ధిగల బ్రహ్మచర్యాను సంపన్ను లింద్రియ నిగ్రహంబను నగ్నియందు జ్ఞానేంద్రియకర్మేంద్రియంబులు నంతరంగ చతుష్టయంబును వేల్తురు. మఱియుఁగొందఱు యోగసంపన్నులయిన గృహస్థులింద్రియంబులను నగ్నులందుననాసక్తులయి ధర్మపరంబులగు విషయంబుల వేల్తురుగాన నవియును యజ్ఞంబులంద్రు॥గీ॥ గణుతికెక్కిన యింద్రియకర్మములను । బ్రాణకర్మంబులను స్వేచ్ఛఁబాఱనీక । యీశ్వరధ్యానమనువహ్ని నెసఁగవెల్చి । యోగివరులక్షరస్థితినొందువారు॥ వ॥ మఱియుఁగొందఱుకర్మయోగపరులు ద్రవ్యదానంబు సేయుట ద్రవ్యయజ్ఞంబనియును, కృచ్ఛ్రచాంద్రాయణోపవాసంబులు తపోయజ్ఞంబనియును, చిత్తనిరోధంబు సేయుట యోగయజ్ఞంబనియును, వేదంబుచదువుటయు శిష్యులకుఁజెప్పుటయు స్వాధ్యాయయజ్ఞంబనియును, వేదార్థంబులశాస్త్రంబులనిరంతరపరిశీలనంబు సేయుట జ్ఞానయజ్ఞంబనియును, వివేకించిప్రయత్నంబునఁదీక్ష్ణ వ్రతులయి వర్తింతురు॥గీ॥ నలి నపానంబునందుఁ బ్రాణంబుచేర్చి।పంచిప్రాణంబునందపానంబుచేర్చి।యుభయగతులనిరోధించియుందు రెపుడు।ధరణియందుఁ బ్రాణాయామపరులపార్థ॥ వ॥ మఱియుఁగొందఱునిరాహారులగు యోగీశ్వరులు జఠరగోళంబుచతుర్భాగంబు చేసి యందు రెండవభాగంబుచేత నొకభాగంబుజలంబుపూరించి యొకభాగంబు వాయుసంచారంబునకు రిత్తరిత్తగానిలిపి, రేచకపూరకంబులఁబ్రాణాయామంబుల జేపించుటయును, కుంభకంబులనింద్రియంబులం బ్రాణగతంబుగావేల్చి రేచకపూరకగతులనిరోధించుటయు, యజ్ఞంబులయ్యె నీ ద్వాదశకర్త

లువిగతకల్మషులు ॥గీ॥ చెలఁగియిట్లుయజ్ఞశేషసుధాంబోధి। బ్రహ్మ పదమునందుఁబరగుచుండు। నిట్టిసుఖముతెలుఁగరేనియైహికముల। నెవ్వరికినిసుఖములెట్లుగలుగు॥ వ॥ అదియునుంగాకబహువిధంబుల గుకర్మయజ్ఞంబులువేదంబులచేతంజెప్పఁబడియె. వీనిబంధకంబులు గానెఱింగిరేని సంసారంబువలన ముక్తులైజ్ఞానసంపన్నులగుదు రు॥ గీ॥ ద్రవ్యమయమైన యజ్ఞతంత్రంబుకంటె । జ్ఞానయజ్ఞతంత్రశ్రే ష్ఠతఁజాలనొప్పు। సర్వకర్మంబులును ఫలసంయుతముగ। ననఘజ్ఞా నంబునందసామ్యంబునయ్యె॥ గీ ॥ జ్ఞానసంపన్నహృదయులుజ్ఞా నవిద్య । వందనప్రశ్నమొనరించువలనుదనర । నీకునుపదేశమిత్తు నునిజముగాను । దానినెఱుఁగుము మిగులఁదాత్పర్యముగను ॥ వ ॥ కావున నిట్లు జ్ఞానసంపన్నుండవయితివేని క్రమ్మఱమోహం బునంజెందకుండుదువు. మఱియు నీభూతజాలంబులు నాయం దునెట్లుగలుగఁజూతువు నీయందును నట్లగలుగఁజూతువు. అది యెట్లన్నను, దన్మహావిజ్ఞానంబునకు నేను సంతుష్టాంతరంగుం డనై నిన్నునాయంతటి వానింజేయుదు. ॥ గీ ॥ పారమింతలేని పాపకర్మునికంటెఁ । బాపినైననేమిపార్థనీవు । పాపమనెడి జలధిపారంబుగాంతువు। తెలిసిజ్ఞానమనెడితెప్పచేత॥ గీ॥ మహి తమగునింధనముల భస్మంబుసేయు। నగ్నిహోత్రునిమాడ్కిని న లఘుచరిత। జ్ఞానవైశ్వానరుండును సంచితంపుఁ। గర్మరాసులభ స్మంబుగానొనర్చు॥ వ ॥ మున్నుచెప్పినద్వాదశయజ్ఞంబులందును జ్ఞానయజ్ఞంబునకు సదృశంబైనయజ్ఞంబులేదు. తద్జ్ఞానంబు కర్మయోగసిద్ధుండగువాఁడు దెలియుఁగానికర్మయోగవిరహితుం డుదెలియలేఁడు॥ గీ॥ శ్రద్ధచేజ్ఞానసిద్ధియుసంభవించు।నవుడెయిం ద్రియసంచారమడఁగిపోవు।జ్ఞానసంప్రాప్తివల్లను శాంతిఁబొందు।

శ్రమకాలంబునందు నేచిరయశోర్థి ॥ గీ ॥ అజ్ఞునకు శ్రద్ధలేనట్టి యధమునకును । సంశయాత్మకునకు హానిసంభవించు । వీరిలోప ల మిక్కిలి మూరమగును । సంశయాత్మునకిహపర సౌఖ్యమనఘ ॥ గీ॥ యోగసన్యస్తకర్ముఁడై యొప్పువాని। జ్ఞానసంఛిన్న సంశయుం డైనవాని। నాత్మవంతునిఁగర్మంబులనఘచరిత । కట్టుపఱుపంగ నేరవు కర్మిగామి॥ క॥ కావుననజ్ఞానజమై । భావంబుననొందినట్టిపటు సంశయముఙ్ । గేవలవిజ్ఞానంబునఁ। బోవంగానడఁచియుద్ధమునకుఙ్ లెమ్మా॥

ఇది జ్ఞానయోగంబను చతుర్థాధ్యాయము.

---

## పంచమాధ్యాయము.

వ॥ అనినవినియర్జునుండిట్లనియె॥ క ॥ సన్యాసమతముఁజెప్పితి। వన్యంబగుకర్మయోగమదియునువింటిఙ్।ధన్యాత్మ రెంటియందును। మాన్యతనియమంబుఁజెప్పుమా తెలియంగఙ్ ॥ వ ॥ అనినభగవంతుండిట్లనియె. వినుమర్జునా! కర్మసన్యాసత్వంబును గృహస్థకృత్యంబగుకర్మయోగంబును నీరెండును మోక్షకర్మంబులిందులోపలఁగర్మసన్యాసంబుకంటెఁగర్మయోగంబధిష్ఠితంబు।సీ॥ ద్వేషంబు తెగటార్చి తెలివొందునాయోగ నిత్యసన్యాసి గానీవెఱుంగు। సంసృతిద్వంద్వముల్ సమయించునాయోగ నిత్యసన్యాసిగానీవెఱుంగు। కాంక్షయించకయైనఁగలుగని యాయోగనిత్య సన్యాసిగానీవెఱుంగు।నాయందుఁజిత్తంబు నాటించు నాయోగనిత్యసన్యాసిగానీవెఱుంగు। సుఖతరుండని యాయోగిఁజొనుపుమదిని। బంధముక్తతనాయోగిపరగుననుము । యోగితతిలోన నాయోగియుత్తముండు। కర్మయోగంబుగలిగిన ఘనుఁడుగాన॥ గీ॥ అనఘసాంఖ్యంబుఁ

గర్మంబునైక్యమనక। భిన్నమనిమూఢబాలకులెన్న నేమి । యందు లోపలనొకటిమెట్లఁగనేని । యుభయయోగఫలంబులనొందవచ్చు॥ గీ॥ సాంఖ్యయుక్తుఁడుపొందు నేస్థానమదియు । యోగయుక్తుఁడుపొందునుయుక్తముగను । సాంఖ్యమును గర్మయోగంబునమతనొకటి। యనుమహాత్ముఁడుచూచినయదియచూచు॥ క॥ కావునసన్న్యాసమునస। ద్భావముయోగంబులేక పటుదుఃఖంబౌ। పావనచరిత్రయోగవుఁ । జేవనుసన్న్యాసిమిగులఁజిత్సుఖమొందున్॥ వ॥ మఱియు యోగయుక్తుండును శుద్ధాత్ముండునునై శరీరంబు స్వాధీనంబుగఁగలవాఁడును జితేంద్రియుండును భూతంబులుదనకునాత్మగాఁగల పరమపురుషుండు దనకాత్మగాఁజూచువాఁడునునైన యోగి వేదోక్తంబులైన యజ్ఞదానాదికర్మంబులుచేసినను దత్కర్మఫలబద్ధుండుగాఁడు॥ క॥ మహనీయయోగసిద్ధుఁడు । విహితంబగుకర్మచయమువెసఁజేయుతఱిన్ । సహజంబులనుచునవియహం । మహామికలంజేయువాఁడెయతఁడుకిరీటీ॥ వ॥ అదియెట్లన్నఁజూచుతఱి వినునప్పుడు స్పృశించునెడ నాఘ్రాణించు సమయంబునఁ గుడుచుపట్టుననడుచు వేళ నిద్రించుకాలంబున నిట్టూర్పులువుచ్చుతఱిఁ బలుకుచో వీడుపట్ల గ్రహించుసమయంబున ఱెప్పవేయుచోటంగనుమూయునంతరంబున నింద్రియంబులు స్వభావంబుగ విషయంబులందుఁ బ్రవర్తించుఁగావునఁదాఁగర్తఁగానని యోగీశ్వరుండు దలంచు॥ గీ॥ బ్రహ్మమునఁగర్మచయములు పరగనిల్పి । సంగమింతయునొల్లనిసరసుఁడనఘ । పుణ్యపాపంబులందులిప్తుండుగాఁడు।పద్మపత్రంబుజలమునఁబరగినట్లు॥ గీ॥ కాయమునబుద్ధిమతమునఁగర్మసమితిఁ। గేవలంబగునింద్రియక్రియలచేత। యోగపురుషులు సేయుచురుత్తమముగ। సంగమొల్లక చేతఃప్రసక్తికొఱకు॥ క॥ యు

క్తుండుఁగర్మఫలసం । త్యక్తుండై శాంతిఁబొందుఁదాత్పర్యము
నన్। యుక్తేతరుండు కామా । సక్తతఫలబద్ధుఁడగును సంగముక
తనన్॥ ఉ॥ సల్లలితంపుఁగర్మములుసాంద్రయశోనిధిసద్విరక్తిచే ।
నొల్లకసన్యసించి పటుయోగసుఖంబునఁజెందుచుండుఁదా। నెల్లె
డజీవుఁబోలికడు హేయపుఁదొమ్మిదితూంట్లమేనిలోఁ। ద్రుళ్లుచుఁజే
యనొల్లఁడుప్రతోషముతోనియమింపఁడన్యులన్॥ వ॥ వినుమీశ్వ
రుండు జీవలోకంబునకుఁ గర్తృత్వంబును గర్మఫలంబులు సృజి
యించినవాఁడుకాఁడు. కర్మవశంబునఁబ్రవృత్తిస్వభావంబుగలిగిన
దేహధారిని గర్మంబులందు నియోగింపుచుండు॥గీ॥ ఒకనిపాపం
బు భరియింపనొల్లఁడీశుఁ । డొకనిపుణ్యంబు భరియింపనొల్లఁడ
ట్లు । పరమసుజ్ఞానమజ్ఞానబద్ధమైన । మోహమందుచు రెఱుఁగని
మూఢజనులు॥ గీ॥ ఆత్మతత్త్వపరిజ్ఞానమడరహృదయ। మాచరిం
చినయజ్ఞానమడఁగఁజేసి । బంధమెడలించి శ్రీహరిఁబరగఁజూపు ।
తమముఁబాపివస్తువుఁజూపుతరణిమాడ్కి॥వ॥ అట్టిబ్రహ్మతత్త్వం
బునందు నిశ్చయాత్మబుద్ధియు దానియందుఁ బ్రయత్నంబందలి
తాత్పర్యంబు నదియయాశ్రయంబుగాఁగలుగుటయును గలిగిన
మహాత్ములును దత్ప్రసాదసిద్ధివలనఁ బాపరహితులై మోక్షంబు
నొందుదురు॥ గీ॥ వినయవిద్యలుగలిగిన విప్రునందు । విమతగో
హంతలందుఁదద్విషయమైన । శునకచండాలురందును జూతురె
పుడు। పండితులు సమబుద్ధిగాబ్రహ్మమనఘ॥ క॥ కావునసమతను
బ్రహ్మస । మావిర్భావంబునొందినట్టి ధరిత్రి। దేవుఁడుజితసంగుం
డై । యావాసముచేసి విష్ణునందువసించున్॥ క॥ పరమోదఖే
దములు మఱి । బొరయక ప్రియమప్రియంబుఁ బొందకయచల।
స్థిరబుద్ధి విగతదేహుఁడు । పరమాత్మవిదుండు బ్రహ్మపదమందుఁ

ఖమీ॥ గీ॥ వెలిసుఖంబులందు విగతేచ్ఛుఁడైమతి । యాత్మసౌఖ్య మహిమఁ నలరునెవ్వఁ। డతఁడు బ్రహ్మ వేది యతినయతరయోగి । యక్షయంపుసుఖముఁననుభవించు॥ గీ॥ ఎవ్వి యింద్రియముల చేత నెసఁగఁబుట్టు । నెవ్విదుఃఖాస్పదంబుగా నెసఁగుచుండు । నవి యునాద్యంతవంతంబులట్లుగాన । బుధుఁడు విషయానుభవములఁ బొరయఁడనఘ ॥ క ॥ కామక్రోధోద్భవమగు । పామరతరయోగమెల్ల బ్రతికినతఱిఁ దా । నేమఱక విడుచుపురుషుం । డామనిగా మోక్షసౌఖ్యమందుఁగిరీటీ ॥ సీ ॥ ఎవ్వఁడు గృహములోనె సఁగుదీపముమాడ్కి దేహంబులోపలఁ దేజరిల్లు । హృదయపంకజవర్తి సిద్ధతేజస్స్ఫూర్తినారాయణాహ్వయనవ్యమూర్తి । సుఖసంజ్ఞచేతను శోభిల్లులక్ష్మీశునతిశోభనాకారునద్రిధీరు । బ్రహ్మాదివంద్యుని బరమాత్ము మోక్షదు నానందమయుని సితాబ్జనయనుఁ । బూచితానెందు మిక్కిలి సుఖమునొందు । నతనియందె సదానందమలరఁజెందు । నట్టిభక్తుఁడె బ్రహ్మంబునధిగమించి । పొందు నవ్యయపదమును బురుషవృషభ ॥ వ ॥ మఱియునక్షీణ యోగులగు ఋషీశ్వరులు శ్రీవాసుదేవునికంటె ద్వితీయవస్తువు లేదని భిన్నసంశయులై సర్వభూత జాలంబులందును సములై నియతచిత్తులై బ్రహ్మనిర్వాణపదంబునొందుదురు॥ క॥ కామక్రోధవిహీనులు । నేమము చిత్తమునఁగల్గు నిర్మలయోగుల్ । ధీమంతులు విదితాత్మకు । లామనిగాముక్తిఁగాంతు రందనునిందన॥ వ ॥ మఱియు మోక్షపరుండగు మునీశ్వరుండు బాహ్యేంద్రియ భోగంబులం బరిహరించి భ్రూమధ్యగతంబగు దృష్టిచేత బ్రహ్మావలోకనంబు సేయుచుఁ బ్రాణాపానగతులఁగుంభకరూపంబున నిరోధించిపరమపదంబునొందు ॥ క ॥ ఇచ్ఛాక్రోధభయంబు

లు । స్వేచ్ఛాగతినడువనీక యింద్రియసుఖములే । తుచ్ఛములుగ నెఱుఁగుధీరుం । డచ్ఛిన్నత ముక్తిఁగాంచు నాద్యంతములన్ ॥ సీ ॥ యజ్ఞంబులకుభోక్తయగు దేవుఁ డెవ్వాఁడు తపములకెవ్వాఁడు దైవమంత్రు । సారిదిజీవులకెల్ల సుహృదుఁడే దేవుఁడు సర్వలోకములకు స్వామియెవ్వఁ । డెవ్వాఁడు సర్వజ్ఞుఁడిందిరానాయకుం డెవ్వనియంశాంశ మీజగంబు । బ్రహ్మాదివందిత పదపద్ముఁడెవ్వఁ డా భువన జాలములందుఁబూర్ణుఁ డెవ్వఁ। డెవ్వఁడీలోకముల కెల్లవిద్ధచరితుఁ। డెవ్వఁ డాచ్ఛాదనంబగునింతటికిని। నట్టిమహనీయుతరుఁ దనయాత్మలోన । నెఱిఁగి మోక్షంబునొందు యోగీశ్వరుండు॥

ఇది సన్యాసయోగంబను పంచమాధ్యాయము.

---

## షష్ఠాధ్యాయము.

వ॥ శ్రీభగవంతుండిట్లనియె॥మ॥ అనఘాత్మా! గతసర్వకర్మఫలుఁడై యచ్ఛిన్న యోగంబుతో । ననయంబున్ గరణీయ కర్మనిచయంబర్హంబుగాఁజేయు వా । విను తాచారుఁడు కర్మియైనఁబరగున్ విఖ్యాత సన్న్యాసియై । వినుమాయోగము దానమున్ విడుచునవ్విప్రుండు సన్న్యాసియే ॥ గీ ॥ ఎద్ది సన్న్యాసమన భూమినెన్నఁబడియె। నదియెయోగంబుగాఁజూడు మార్యవర్య । సకలసంకల్ప సన్న్యాసశాలిగాక । యోగిగానేరఁ డాతఁడు యోగివృషభ ॥ వ ॥ హృదయంబునందు ధ్యానంబుచేత శ్రీవాసుదేవుసాక్షాత్కారం బపేక్షించు మునీశ్వరునకు వేదోక్తకర్మంబుఁజేయవలయు. హృదయంబునందునతని సాక్షాత్కారంబు గలిగిన యోగీంద్రునకుఁగర్మోపశాంతి గావలయు॥ గీ॥ ఎప్పుడెప్పుడు విషయ భోగేచ్ఛమాను। నెప్పుడెప్పుడు కర్మంబులెడలఁజేయు।

నపుడె యోగాధిరూఢుఁడై యలరుచుండు । సర్వసంకల్పముల తోడ జాగుమాని॥ వ॥ మఱియుఁబురుషుండు వివేకయుక్తంబగు చిత్తంబుచేత జీవునినుద్ధరింపందగుంగాని యధోగతిం బడఁద్రోయఁదగదది యెట్లన్నఁజిత్తంబు దుర్విషయంబులందుఁ బ్రవర్తించి జీవుని ముకుర్కద్రాటకె బసరంబునీడ్చిన చందంబున నీడ్చికొనిపోయి నరకంబునొందించు. సత్కర్మ కర్తయైన జీవునికి మోక్షంబు సంపాదించుంగావున జీవునకుఁ జిత్తంబు శత్రుండునయ్యె నది యెట్లన్న దుష్కర్మకర్తయై పుణ్యలోకంబునకు జీవునిదూరస్థుని జేయుంగావున॥ క॥ జీవునికి మనము బంధుఁడు । జీవునిచే మానసంబు జితమైనతఱిన్ । జీవునికి మనము శత్రుఁడు । జీవునిచే మానసం బజితమైనతఱిన్॥ గీ ॥ జ్ఞానవిజ్ఞాన సంపూర్ణ మానసుండు । స్వర్ణమృత్పిండ పాషాణసదృశబుద్ధి । నలరు జీవుండువిజితేంద్రియత్వశాలి । యోగియంచును బుధులెన్ననొప్పుచుండు ॥ గీ॥ బంధుమిత్రులయందును బాపపుణ్యు । లందుదాసీనసద్వస్తులందునరిసు । హృత్తులందునుసమత వర్తించువాఁడు । యోగులందు విశిష్టుఁడైయొప్పుచుండు ॥ వ ॥ యోగీశ్వరుండు నిరంతర సమాధియుక్తుండై యేకాంత వాసియై సంగశూన్యుండై నియమింపఁబడిన మనోదేహంబులు గలవాఁడై కాంక్షా రహితుండై ప్రతిగ్రహశూన్యుండై ప్రవర్తింపుచుండు ॥ గీ ॥ శుద్ధమగు దేశమునఁగుశస్తోమమునిచి । దానిపై మంచియజినంబుదాని మీఁద । వస్త్రమిడియాసనము సేయవలయు మిగులఁ । బొడవునీచంబుఁగాకుండఁబురుషవృషభ ॥ గీ ॥ అట్టియాసనంబునందుఁ బ్రవేశించి । మనము నింద్రియములుమట్టుపఱిచి । యిష్టసిద్ధికొఱకు నేకాగ్రచిత్తుఁడై । యోగ మభ్యసింపుచుండవలయు ॥ వ॥

మఱియుఁగాయశిరో గ్రీవంబులు మూలాధారంబు మొదలుకొని శిరః పర్యంతంబుగా సమత్వంబున నిలుపుచు స్థిరచిత్తుండై చలింపక బ్రహ్మధ్యానపరుండై నాసికాగ్రంబద్ధ నిమీలిత నేత్రంబులఁజూచుచు దిక్కులంజూడకుండవలయు॥ సీ ॥ ఘనశాంతమాత్మలోఁగలిగి బ్రహ్మమునందు యుక్తుఁడై యోగి తానుండవలయు మనము చాంచల్యంబుమాన్పి బ్రహ్మమునందు యుక్తుఁడై యోగి తానుండవలయు। బ్రహ్మచర్య వ్రతపరత బ్రహ్మమునందు యుక్తుఁడై యోగి తానుండవలయు। భయిమించుకయులేక బ్రహ్మంబునందున యుక్తుఁడై యోగి తానుండవలయు। యోగి నాయందు మదినిల్పియుండవలయు। యోగి తత్పరబుద్ధితోనుండవలయు। యోగియోగంబు నేమఱకుండవలయు।విజయ సంగ్రామ సంభృత విత్తవిజయ॥ గీ॥ఎపుడుఁజిత్తంబుఁబరమాత్మ నెనఁగఁగూర్చి। నియత మానసవృత్తిచేనిలిచియుండి। నేఁబ్రవర్తించు నిర్వాణనియమములను। యోగివర్తించు సంసృతిత్యాగియగుచు॥ క ॥ కేవలబహ్వాశి నిమఱి। కేవలనిచాశనునిని గేవలనిద్రుఁ । గేవలజాగరశీలుని। భావింపఁగయోగమేల ప్రాపించుభువిఁ॥ గీ॥ తగినయాహారవిహారణ తత్పరతను। దగినజాగరనిద్రలఁదగినయట్టి। కర్మచేష్టలవర్తింపఁగఁ డఁగువాని। యోగమెందుల దుఃఖంబునొందకుండు॥ గీ ॥ ఎపుడు నియమితమానసంబిశునందు । నుపగతంబైనవిస్ఫూర్తినొందుచుండు। నెపుడుకామంబులం దెల్లనిచ్ఛమాను । నపుడెయుక్తతముండ యియెలరుచుండు॥ గీ॥ వాతరహితమగుచు వర్తిల్లుగేహంబు। నందువెలుఁగుదీపమట్టులెపుడు। నియతచిత్తుఁడగుచు నిర్మలాత్మకుఁడైన। యోగయుక్తపురుషుఁడొప్పుచుండు॥ గీ॥ ఎవనిచిత్తంబుస్వాధీనమైనయుచుండు। యోగసేవనుబ్రహ్మసంయుక్తమగుచు। నెవఁడు

చిత్తంబుచే బ్రహ్మనెసఁగఁజూచు । నధిక సంతుష్టుఁడై పరమాత్మ
యందు॥గీ॥ బుద్ధిచేతగ్రహింపఁగాఁబోలునట్టి । యింద్రియాతీతమ
గుసుఖంబెఱుఁగుచుండు। నందుయోగియుఁజలనంబునొందకుండు।
నాత్మతత్త్వపరిజ్ఞానమలవరించి॥ గీ ॥ అరయనేలాభమందినసం
తకంబె। లాభమధికంబు లేమి దలంపఁబడును। జిత్తమందును మ
గ్నతఁజేసినపుడు। శీతవాతాదిదుఃఖముల్ చెందకుండు॥ గీ ॥ ఎం
దుదుఃఖపరిప్రాప్తియెసఁగకుండు। నదియెయోగంబుగానీవు మది
నెఱుంగు। మట్టియోగంబు నిశ్చలితాత్మచేత। నభ్యసింపుమునియత
ప్రయత్నమనను॥ గీ॥ ఆత్మసంకల్పములవల్లనంకురించు । సర్వకా
మంబులనుద్రోచిసంతతంబు। మనముచేనింద్రియమ్ములమగుడఁబట్టి।
యోగమభ్యాసమొనరింపుచుండవలయు॥ గీ ॥ బుద్ధిచేతను ధైర్యం
బుపొసఁగఁబట్టి। మెల్ల మెల్లనెయోగంబుమెలఁగఁజేసి। యాత్మసం
స్థంబుగామనములవరించి। చింతమదిలోన నొకింతచేర్పవలదు॥
గీ॥ చంచలస్ఫూర్తివర్తిల్లుచపలచిత్త। మెప్పుడెప్పుడుచలితమై యె
ప్పుడప్పు। నప్పుడప్పుడపోసికనడఁగఁబట్టి । యాత్మవశముగఁజేయు
చున్నతఁడుయోగి॥ గీ॥ శాంతచిత్తునివీతరజస్కుఁడిగుల।బ్రహ్మభా
వనపరుఁడైన ప్రాజ్ఞతముని।విగతకల్మష నత్యంతవిమలచరితు।ను
త్తమంబగుపరసౌఖ్యమొందుఁబార్థ॥వ॥నిరంతరంబు పరమాత్మునం
దుమనంబుఁజేర్చి విగతకల్మషుఁడయి వర్తించు యోగీశ్వరుండుస
త్కర్మంబులయందు నాయాసంబులేక బ్రహ్మసాక్షాత్కారజన్యం
బగుసుఖంబుననుభవించు॥ గీ॥సర్వభూతస్థుఁగానన్నుఁజర్చసేయు।
సర్వమెప్పుడునాయందు జరగఁజూచు।యోగయుక్తాత్ముఁడయినట్టి
యుత్తముండు। సర్వభూతంబులందును సమదృశుండు॥ గీ ॥ సర్వ
విశ్వంబునాయందుసమతఁగాంచు । సర్వవిశ్వంబుననునన్ను సమ

తఁజూచు। నతని కెప్పుడు నేను దృశ్యత వహించి। నతని నాలోన నగ్ర
పచేతనలరఁజూతు॥ వ॥ మఱియు సర్వభూతస్థితుండనగు నన్ను
నన్యదేవతాభజనంబువర్జించి పరబ్రహ్మంబుగా నేకబుద్ధిభజియిం
చుయోగీశ్వరుండు సత్కర్మంబులయందు వర్తించెనేమి వర్తింపక
యుండెనేమి నాయందువర్తించు ॥ గీ ॥ తోడరినట్టి సౌఖ్యదుఃఖ
ముల్ తనకెట్టు। లట్లకా దెపరులకనుచుఁదలఁచి। సకలజంతు దేహ
చయమును దన దేహ। మెట్టులట్లుచూచుసిద్ధయోగి॥ వ॥ అనినవిని
యర్జునుండిట్లనియె. మధుసూదనా! నీచేతఁజెప్పంబడిన యోగంబు
నమనంబునుస్థిరంబు సేయశక్యంబుగాదది యెట్లన్నఁ జిత్తంబుచంచ
లస్వభావంబుగావున॥ గీ॥ అంగసంక్షోభబలవంతమధికదృఢము ।
చంచలంబుగదా మానసంబు కృష్ణ! । దీని నిగ్రహకర్మంబు మాన
రాదు। గాలియనుమూటగట్టఁగాఁగానికరణి॥వ॥ అనినశ్రీభగవం
తుండిట్లనియె॥ గీ॥ సంశయములేదుపార్థనీశంక యేల। దుర్లభంబ
గు చలనంబుద్రోచిపుచ్చు। ప్రబలవైరాగ్యమహిమనభ్యాసమున
ను। మనముఁగురియించవచ్చుసాధనముఁజేసి॥ గీ॥ నియతచిత్తుఁడు
గాలేని నీచమతికిఁ। బొందరాకుండుయోగంబుపుడమిలోన। నియ
తచిత్తుఁడు యోగంబునిర్వహింప । శక్తుఁడగునిర్మలోపాయసౌ
ష్ఠవమున॥ వ॥ అనినవినియర్జునుండిట్లనియె ॥ గీ ॥ శ్రద్ధతోఁగూడ
యోగంబుసంగ్రహించి। మనము యోగంబువల్లను మగుడఁజేసి ।
విగళితాభ్యాసుఁడగుచును వెలయుయోగి । సిద్ధిలేక యేగతియెట్లు
చెందుఁగృష్ణ॥ వ॥ మఱియు సామాన్యపురుషుండు కొంతకాలంబు
కర్మంబులుచేసి వాసుదేవార్పితంబు సేయనికతంబున స్వర్గదూ
రుండును మఱియుఁగర్మములుసేయక సన్న్యాసియై యభ్యాసవై
రాగ్యశూన్యుండునునై యోగభ్రష్టుండయి నకతంబున మోక్షదూ

రుండునై యుభయమార్గంబులఁ బ్రతిష్ఠలేక మూఢుండై భిన్నంబై న మేఘంబు మేఘాంతరంబ నొందక నడుమ నాశంబునొందిన చం దంబున నెట్లు నాశంబు నొందకుండు॥ గీ॥ ఈమహాసంశయము నా కు నేర్పరించి। తెలుపుటకు నీవె కాని యో దేవదేవ। నీవు మిక్కిలి యగువారి నేనెఱుంగ। జరత రాశేషసంశయచ్ఛేదివీవు॥ వ॥ అనినవి ని శ్రీభగవంతుండిట్లనియె॥ వ॥ అర్జునా! నీవు చెప్పిన సామాన్యయో గికీలోకంబునను బరలోకంబునను భ్రష్టత్వంబులేదు. పుణ్యకర్మం బులు చేసినవాఁడొకానొకండును నరకంబునొందఁడు॥ గీ॥ పుణ్య కర్ములలోకముల్ పొంది సుఖము। శాశ్వతంబగువర్షముల్ సలిపి పి దప। యోగమున భ్రష్టుఁడైనట్టి యోగివరుఁడు। శుద్ధసంపన్నగృ హముల నొరిదిఁబుట్టు॥ గీ॥ ఇట్లుగాదేనివిధియుక్తినెసఁగునట్టి। యోగివర్యులకులములనుద్భవించు। నిట్టిజన్మంబు దుర్లభం బెవరికైన। యోగులకుఁగాక భువిలోనయోధవర్య॥ గీ॥ భద్రయోగికిమా ఱుటభవమునందుఁ। బౌర్వదైహికయోగంబు ప్రబలమగును। మ హితవరయోగసిద్ధికిమరలి మరలి। మాఱుదేహంబులందునుమరలు చుండు॥ గీ॥ పౌర్వికాభ్యాసమున సిద్ధిఁబడయలేక। యతిశయంబు గనవశనం దనేని। బ్రహ్మజిజ్ఞాస చేఁజాలఁబరగుఁగాని। కర్మచయ ములచేతఁ దాఁగట్టుపడఁడు॥ గీ॥ యత్నమునయోగసంగ్రహమమ రఁజేసి। దోషములఁబాసిసంసిద్ధిదొడరువాఁడు। పెక్కుజన్మంబు లందైనఁబెనఁగిపెనఁగి। వెనుక నిర్వాణపదమున వెలయుచున్న॥ గీ॥ తపసికన్ననుయోగిదాధన్యతముఁడు। జ్ఞానికన్నను యోగిస న్మానయుతుఁడు। కర్మికంటెను యోగిసగౌరవుండు। కానసీవును యోగివిగమ్ము పార్థ॥ గీ॥ సర్వములసమైనయోగీశచయముసందు।

వంతరాత్మను నాయందునలరఁ నిలిపి। శ్రద్ధచేతనునా సేవ సలుపున
తఁడు। సతతయోగోత్తముఁడునాకు సమ్మతుండు॥

ఇది సన్న్యాసయోగంబను షష్ఠాధ్యాయము.

---

## సప్తమాధ్యాయము.

వ॥ శ్రీభగవంతుండిట్లనియె॥ గీ॥ నన్నునెఱిఁగెడిజ్ఞానంబు
నాదుయోగ। మనఘునాయందునేచిత్తమమరియుంట। నన్నుమఱి
యాశ్రయించుటనుఁడసేకుఁ। జెప్పెదను సంశయంబింతచెందకుం
డు॥ గీ॥ జ్ఞానమను దానివిజ్ఞానసహితముగను। విమలమతినీకుఁజె
ప్పెదవిస్తరించి। యెద్దియెఱిఁగినఁగ్రమ్మఱనెఱుఁగఁదగిన। యర్థమే
మియులేకుండునట్టిదాని॥ గీ॥ వేలసంఖ్యలలోపలవెదకిచూడఁ। జి
త్తనియతికియత్నంబుసేయునొకఁడు। వారిపెక్కండ్రలోపలవెదకి
చూడ। గట్టిగానన్నునెఱిఁగెడి ఘనుఁడొకండు॥ గీ॥ అవనిజలము
ను వాయువునాకసంబు। నగ్నియునుబుద్ధిచిత్తమహంకరణము। ల
నఁగనెనిమిది భేదంబులయ్యెనంద్రుమ।ప్రకృతి యిరువదినాలుగై పర
గునవియు॥ వ॥ ఈ చతుర్వింశతితత్త్వాత్మకంబగు వాయువునాక
సంబగ్నియను ప్రకృతికంటెఁబరంబగు జీవప్రకృతిగలదు. దానిచే
జగంబుచేతనంబై ప్రవర్తిల్లు॥ గీ॥ ఇట్టిప్రకృతులు రెండును హే
తువులుగఁ। బ్రభవమొందును భూతసర్గంబుతెలియు। నెలమిఁబు
ట్టించుటకు దాని నేర్చుటకును। గారణముసేనెసందేహకలనవల
దు॥గీ॥ నేనెకర్తను నాకంటె నెసఁగనొకఁడు। పార్థ యీవిశ్వ
సృష్టికిఁబరగలేఁడు। కూర్చివిశ్వంబునాయందుఁగూడియుండు। మ
ణులుసూత్రంబునందున మలసినట్లు॥వ॥ మఱియు జలంబులందలి
రసంబును సూర్యచంద్రులయందలి ప్రభయును వేదంబులయంద

లి ప్రణవంబును నాకసంబునందలి శబ్దంబును బురుషులయందలిపౌ
రుషంబును గ్రమంబున నేనెకానెఱుంగుము॥ గీ ॥ భూమియందలి
సౌగంధభూతియేన। యగ్నియందలి కాంతియునలరనేన। దేహ
ధారులజననసంస్థితులునేన। తపసులందలియుత్కృష్టతపమునేన॥
గీ॥ బుద్ధిమంతులయందలిబుద్ధినేన । తీవ్రతేజులయందలి తేజమేన।
నిఖిలభూతంబులకునెల్ల నిత్యమైన । బీజమునునేన తెలియుముపృ
థులశౌర్య॥ గీ॥ కామరాగాదివర్జనకలితమైన । సత్యసంపన్నులం
దలి సత్యమేన। ధర్మహానికిఁదలఁకెడుధర్మమేన । కామమనభూత్మ
నేనకాఁగనుముమదిని॥ వ ॥ మఱియు సాత్వికంబును దామసంబు
ను రాజసంబును నావలన నుత్పన్నంబులయ్యె నట్టిసత్త్వరజస్త
మోగుణంబులునాయధీనంబులై ప్రవర్తించుఁగాన నేను జీవునిం
బోలివానికధీనుఁడనుగాను ॥ గీ ॥ మూఁడుగుణములచేతను మొన
సివిశ్వ। మఖిలమును మోహితంబునై యలరుచుండు । నవ్యయుం
డును గుణములకన్యతముఁడు।నైన ననుఁగానలేరు మోహమునఁ
జేసి।గీ॥ దైవకృతమై జగంబులోఁదనరుచున్న। మాయత్రిగుణాత్మ
కంబదిభూమకంబు। దాటుటకు దుస్తరముదానిదాటువారు । నా
దుభక్తులు జలధిని నావఁబోలి॥గీ॥ దోషకారులుమూఢులు దుష్ట
జనులు । దైన్యభావసమాశ్రితుల్ దర్పయుతులు । నాప్రవృత్తికి
లోనుగానడువరనఘ । మాయ నపహృతవిజ్ఞానమతులు గాన ॥
గి॥ కొందఱార్తతోనన్నుఁగొలుచువారు । కొందఱధ్యాత్మవిద్య
కై కొలుచువారు। కొందఱర్థార్థులైనన్నుఁ గొలుచువారు। కొంద
ఱిలజ్ఞానులైనన్నుఁగొలుచువారు ॥ గీ ॥ వీరిలోపలనుజ్ఞానివెలయ
ఘనుఁడు। భక్తియోగంబుగలిగిన భద్రమూర్తి। వానికేనుబ్రియుం
డను వాఁడునాకుఁ।బ్రియుఁడు మిక్కిలి భక్తిచేఁబెద్దగాన॥ వ॥ మ

ఱియు నార్తుండై నన్నుభజియించువాఁడును నర్థార్థియై భజియించువాఁడును జిజ్ఞాసుఁడై భజియించువారును మోక్షేతులైయుం దురు విశేషించియు నన పేక్షుండైనజ్ఞానిమదీయశరీరంబుమాడ్కిఁ నుప్రియుండైయు త్తమగతినైన నన్నుంబొందు॥ గీ॥ పెక్కుజన్మం బులందును బేర్చి పేర్చి। భక్తియోగంబు మదిలోనఁబడయఁజేసి। యఖిలజగములు హరికళయనుచుఁగాంచు। నామహాత్ముఁడు దుర్లభుఁడనఘచరిత॥ గీ॥ కామములచేతఁజాలభంగంబునొంది। యన్యదేవతారక్తులై యలరుచుందు। రాదిజన్మంబునందు వారట్టివార। కానఁద ద్దేవభక్తులుగలిగియుండు॥గీ॥ ఎవ్వరెవ్వరేయేవారినెల మిఁగొల్తు। రధికతరమైన శ్రద్ధచేనట్టివారి। శ్రద్ధత ద్దేవతలయందు జరగఁజేయుఁ। దలఁతుదేవతలెల్లనాకళలుగాన॥ గీ॥ శ్రద్ధచేతనుదెల్లగా జరపినట్టి। దేవతారాధనముచేతఁదృప్తిఁబొంది। వారలకుఁజాలఫలమిచ్చువాఁడనేన। దైవతావళినాదగుతనువుగాన॥ గీ॥ అంతఁదత్ఫలజాలంబు నధిగమించు। నల్పమేధసులగు వారలనఘచరిత। దేవతలఁ బొందుదురు సుర్వోదేవయాజు। లనఘమద్భక్తిపరుఁడున న్నధిగమించు॥ వ॥ మఱియు బుద్ధివిహీనుండగు దురాత్ముండు తన భావంబున నన్నుఁబరబ్రహ్మంబనియును నవ్యయుండనియు నత్యంతోత్తముండనియును నెఱుంగంజాలక రామకృష్ణాద్యవతారంబుల దేహధారి మాత్రంబులుగ దేవతాంతరంబులుగఁ దలంచు॥ గీ॥ అజుఁడనవ్యయమూర్తినై యలరునేను। యోగమాయావృతుండనై యొరులచేతఁ। జూడఁబడకుందు మూఢుండు శూన్యహృదయుఁ। డనఘ మిక్కిలి నన్నులోనరయలేఁడు॥గీ॥ తొల్లిమృతిఁబొందినట్టి జంతువులనెల్ల। వర్తమానంబులగువాని వచ్చువాని। నేనెఱుఁగుదుఁగాని నన్నెట్టిజంతు। వైననెఱుఁగంగలేదు మ యాబ

లమున॥ గీ॥ కాంక్షచే ద్వేషబుద్ధిచేఁగలుగునట్టి। ద్వంద్వమోహం బుచేఁగాదె తెలియుచుగాఁగ । జన్మమరణాదిసుఖదుఃఖసంకులంపు సర్గమునుబొందఁజొచ్చును జంతుచయము॥ గీ॥ పుణ్యకర్మతఁబా పంబుఁబొలియఁజేసి । ద్వంద్వమోహంబుఁదమలోనఁదగులనీక । దృఢతమవ్రతయుక్తులైదినదినంబు। భజనమొనరింపుదురునన్ను భ క్తిపరులు॥వ॥ మఱియు జరామరణంబులు పోవుకొఱకు నన్నాశ్ర యించి నియతచిత్తులైన జ్ఞానయోగులను గర్మయోగులను నెఱుం గుము॥ గీ॥ సాధిభూతాధిదైవంబు సాధియజ్ఞ । మనుచునన్నునె ఱుంగునయ్యార్యతముఁడు । మరణకాలమ్మునను నన్నుమఱవకుం డు। యోగయుక్తుండుభక్తియోగోత్తముండు॥

ఇది పరమహంస విజ్ఞానయోగంబను సప్తమాధ్యాయము.

---

## అష్టమాధ్యాయము.

వ॥ అనినవిని యర్జునుండిట్లనియె ॥ గీ ॥ బ్రహ్మమెయ్యది యధ్యాత్మభావమెద్ది । కర్మమెయ్యదిపలుకుము కమలనయన । కృష్ణ యధిభూతమెయ్యది కేవలముగ । వానిఁదెలియంగఁజెప్పుమా వరుసనీవు॥ వ॥ మఱియునీశరీరంబునందు నధియజ్ఞంబనఁనెయ్యదిప్ర వర్తిల్లుఁబ్రయాణకాలంబున నియతచిత్తులైన మహాత్ములచేత నె ట్లుతెలియఁబడుదువు తెలుపవేయని యడిగిన శ్రీభగవంతుడిట్లని యె ॥ గీ ॥ అక్షరంబుపరబ్రహ్మ మనఁగనొప్పు । జీవుఁడధ్యాత్ముఁ డను పేరఁజెప్పఁబడును । భూతములుచేయు యజ్ఞముల్ పుణ్యచ రిత । కర్మనామంబుచేఁబలుకంగఁబడును ॥ గీ ॥ అనఘయంత్యం బు నందునన్నెనుసరించి । దేహమునుబాసి పోయెడి దేహియపు డు । బ్రహ్మపదమగుభావంబు పరగఁజెందు । సందియములేదు దీ

నికిసవ్యసాచి ॥ గీ ॥ వెలయుదేహంబువిడుచు నవ్వేళననఘ! బా
ధితంబైనతలంపునంబాయునెద్ది । యాశరీరంబుసంప్రాప్తమగును
గానం । దొలుత మద్భావకుండైనంద్రోచిచనండు॥ వ॥ మఱియు
సర్వకాలంబునందును యుద్ధంబునందును నన్నుందలపోయుచుం
డుము. నాయందు మనోబుద్ధులు దగులంజేసి యోగయుక్తినుండె
తేని నన్నుంజెందెదవు. సంశయంబులేదు ॥ గీ ॥ అనఘుయభ్యాస
యోగంబు నధిగమించి । చిత్తమన్యంబు మీందను జెందనీక । పర
మపురుషునందలపోయుపావనుండు । బ్రహ్మమును జెంది యెన్నం
డుంబాయకుండు ॥ వ ॥ మఱియుసర్వజ్ఞుండును బురాణపురుషుం
డును శాసించువాండును నణువుకంటెనణువును సర్వంబునకుం
బోషకుండును నచింత్యరూపుండును నాదిత్యవర్ణుండును దమో
దూరుండునునై నన్ను స్మరించువాండు ॥ గీ ॥ మరణదశయందు
నామీందమనసునిలిపి । విమలతరభక్తియుక్తుండై బొమలనడుమం ।
బ్రాణముల్ చేర్చి మృత్యువుంబాఱందోలి । బ్రహ్మమగు దివ్యపురు
షునింబడయునవఘ ॥ గీ ॥ వేదవిదులక్షరంబన వెలయునెద్ది । యు
తిజనంబులు వసియింపనలరునెద్ది । యద్దికాంక్షింతురధ్యాత్మ
మెఱుంగువారు । తత్పదంబును జెప్పెదందనరవినుము॥ గీ॥ సర్వదే
హస్థరంధ్రముల్ సంయమించి । మనముహృదయంబునందును మ
రుగంజేసి । ప్రాణమును బ్రహ్మరంధ్రంబుంబరగంజేర్చి । యోగ
ధారణమొందును యోధుండగుచు ॥ గీ ॥ బ్రహ్మమైనట్టియోంకా
రపరమమంత్ర । ముచ్చరింపుచు నామూర్తినొనరంజూచు। నరుం
డుదేహంబువిడిచి యనంతరంబ । పరమసద్గతిం జెందును బాండ
వేయ ॥ గీ ॥ చిత్తమన్యంబునందును జెందకుండ । నిత్యమునున
న్నుందలపోయునిర్మలులకు । యోగభావనంబాయనియుత్తమున

కు। నేనుమిక్కిలి సులభుండనిజముపార్థ ॥ వ ॥ మఱియు మత్సం
బంధంబయినపరమగతిం బొందిన మహాత్ములు దుఃఖాశ్రయంబునున
శాశ్వతంబునునగు పునర్జన్మంబునొందరు ॥ గీ ॥ బ్రహ్మలోకాది
లోకసంప్రాప్తులయ్యు। మరలుదురుకాదెపుణ్యముల్ మానినపు
డె। విష్ణులోకనివాసులై వెలయువారు। మగుడిజన్మంబునకురా
రుమాన్యచరిత॥ వ॥ మఱియుఁగృతత్రేతాద్వాపరకలియుగంబులు
గూడియొక మహాయుగంబయ్యె నట్టిమహాయుగంబులు వేయిం
చనబ్రహ్మదేవునకు నొక్కదినంబయ్యెనింతియకాలంబు రాత్రియై
వర్తిల్లు. ఇట్లతని దివారాత్రంబుల కాలంబులుమహాత్ములెఱుంగు
దురు ॥ గీ ॥ జంతువులు బ్రహ్మదివమునజననమొంది। రాత్రివచ్చిన
యప్పుడు ప్రళయమొందుఁ। బరగనవ్యక్తమనియెడి పదమునం
దుఁ। బుట్టుటయుఁగ్రమ్మఱనువాని పొలియుటయును ॥ గీ ॥ జం
తువులు బ్రహ్మదివమున సంభవించి। పురుషవర! రాత్రియందును
బొలిసిపొలిసి। కర్మపరతంత్రవృత్తిచేఁ గ్రమ్మఱంగఁ। బుట్టుచుండు
నిరంతరంబుగజగములు ॥ వ ॥ మఱియుఁబరమపురుషుండగు వా
సుదేవుండు ప్రకృతికంటెఁబరుండును దద్వ్యతిరిక్తుండును జక్షురా
ద్యగోచరుండును సనాతనుండును జరాచరప్రళయంబునందుఁ
దాను లయంబునొందనివాఁడునై ప్రవర్తిల్లు॥ గీ ॥ అక్షరంబును
నవ్యక్తమనఁగనొప్పు। పరమగతిసంజ్ఞతోడను బరగువాఁడు।
పొందిమరలంగరాని యాపుణ్యపదము। ననఘవాయదిగాఁజూ
డుమాదరమున ॥ గీ ॥ ఏమహాత్మునిలోనుండునీప్రపంచ। మేమ
హాత్మునిచే వ్యాప్తమీప్రపంచ। మట్టిపురుషునిఁబొందుటకనఘచరి
త। పరమమగుసాధనము లేదుభక్తిదక్క ॥ క ॥ ఏకాలంబున
యోగులు। ప్రాకటముగమరణమొంది రారెవ్వేళన్। వ్యాకులు

తఁజచ్చివత్తురు । నీకా కాలములు తెలియ నేనెఱిఁగింతుఁ ॥ వ ॥ మఱియు మకరసంక్రాంతి మొదలుకొని మిధునాంతంబుగా నుత్తరాయణ మనంబడును; అయ్యయనంబు దైవతంబు; తదయనంబున శుక్లపక్షంబున దివంబు చన్మృతుండయిన బ్రహ్మవిదుండగు యోగీశ్వరుండు పరబ్రహ్మస్థానంబునకుం జని యెడి మార్గంబున నగ్నియుఁ గిరణంబులుగల సూర్యుండును దివాభిమాని దేవతయు శుక్లపక్షాభిమాన దేవతయుఁ బ్రకాశమానంబులై యుండ నిట్లు చని బ్రహ్మస్థానంబు నొంది పునరావృత్తిరహిత శాశ్వతుండై యుండు ॥ గీ ॥ చంద్ర దైవతంబు సమధికధూమంబు । నసితపక్షనిశియు నన౯ఁగ మించు । దక్షిణాయనమున ధర్మాత్ముఁడగు యోగి । చచ్చి మగిడి వచ్చు జన్మమునకు ॥ వ ॥ వినుమీ శుక్లకృష్ణమార్గంబులు జగంబులకు శాశ్వతంబులు వీనియందు శుక్లమార్గంబు చేత ననావృత్తియుఁ గృష్ణమార్గంబు చేతఁ బునరావృత్తియుఁ గలిగి వర్తిల్లు ॥ గీ ॥ ఇట్టి రెండు జగము లెఱిఁగిన యోగీంద్రుఁ । డాశపడఁడు స్వర్గమధిగమింప । నట్లు గాన నీవు నఖిలకాలములందు । యోగవృత్తి చేతనుండు పార్థ ॥ ఉ ॥ వేదములన్ మఖంబులను విశ్రుత దానతపంబులన్ సము । త్పాదితమైన పుణ్యము నధఃకరణం బొనరించు యోగియ । య్యాదిమపూరుషోత్తము నిజార్థము నెమ్మది సంగ్రహించి నిర్వేదన లేక యార్యమగు విష్ణుపదంబును జెందు నర్జునా ॥

ఇది యక్షరపరబ్రహ్మయోగంబను నష్టమాధ్యాయము.



## నవమాధ్యాయము.

వ ॥ శ్రీభగవంతుండిట్లనియె ॥ గీ ॥ గుహ్యతమమిది మిక్కిలి కోరి తెలియ ॥ జ్ఞాన విజ్ఞాన కలితమై జరగునీకుఁ । దెలియఁజెప్ప

దనేదానిఁదెలిసితేని । యశుభములఁబాయఁగలవసూయావిదూర॥ వ ॥ మఱియు విద్యలకురాజును గుహ్యంబులకురాజును బవిత్రంబును నుత్తమంబును బ్రత్యక్ష ఫలంబును ధర్మపరంబును సుకరంబుగాఁజేయవచ్చునదియునై ప్రవర్తిల్లు ॥ గీ ॥ ఇమ్మహాధర్మగతియందు నెవ్వరేని । శ్రద్ధతోఁడుతఁబాసినజాడ్య పరులు । వారునన్నుఁబొందఁజాలక వనటచేత । మృత్యుసంసారపథమున మెలఁగుచుంద్రు॥ గీ ॥బ్రహ్మమైనట్టినాచేత బ్రహ్మసృష్టి। రక్షితంబయివ్యాప్తమై రహినిబొందు । భూతముల కెల్లఁగారణభూతమైన । కార్యముల భూతములయందుఁగలుగనెపుడు ॥ వ ॥ మఱియు నాయందు భూతంబులును, నేనయది గావునమదీయంబగు భూతవ్యాపకత్వంబును, భూతంబులరక్షించు వాఁడనయ్యు నహంకారయుక్తుండగు జీవునింబోలి నిరహంకారుండగు నేను భూతంబుల యందునుండు వాఁడఁగాను ॥ గీ ॥ నింగియందును నాధైన నియతితోడ । విపులవాయువుపూర్ణమై వెలయునట్లు । సకలభూతచయంబును సంతతంబు । న్నాదుదుర్ధమ తేజంబు ననువసించు॥గీ॥ ప్రాణిజాలంబునాదగు ప్రకృతియందు । సంగతంబగుఁ గల్పాంత సమయమునను । దిరుగఁగల్పాదియందు నుద్దీపితముగఁ । జేయుచుందుదు నీభూతసృష్టిఁబార్థ ॥ వ ॥ వినుము నేనుమదీయంబగు ప్రకృతి నధిష్ఠించికల్పాంతంబులందు లీనంబులైన చతుర్విధసృష్టిఁదదీయపూర్వ కర్మానుసారంబుగఁజేయుచుందుదు ॥ గీ ॥ విశ్వసృష్ట్యాదికర్మముల్ వెలయు నన్ను।బద్ధుఁగాఁజేయఁజాలవు పాండవేయ । దానియందును నేనుదాసీనుఁబోలి । యుండుదును జువ్వెయాసక్తినుజ్జగించి ॥ గీ ॥ ప్రకృతినాదగు నధ్యక్షభావమునను । విశ్వసృష్టయొనర్చుచు వెలసెఁగాడె । యనఘ యదికార

ణంబుగానఖిలజగము । నురుతరంబుగ వ ర్తింపుచుండు నెపుడు॥ ౧౧ ॥ మూఢులైన మనుష్యులు మోహమంది । నన్నెఱుంగరు పరుఁడైన నాథుఁడనుచు । భక్తజనరక్షణమునకై పొందవేయ । మానుషాకారమును బొంది మలయుకతన ॥ వ ॥ వినుము నా కంటె నన్యదేవతలు శీఘ్రఫలదులని మోఘాశులును మద్విముఖత్వంబున మోఘకర్ములునగుతరఁబులచేత మోఘజ్ఞానులును, జపలాత్ములునైన మూఢాత్ములు రాక్షసియును నాసురియునయిన మోహకర్మ ప్రకృతినాశ్రయించిన వారైన నన్నెఱుంగరు॥ గీ॥ దైవియైనట్టి ప్రకృతిచేధన్యులగుచు । వెలయుచుండు మహాత్ములు విశ్రుతముగ। నవ్యయుండును భూతాదినైననన్ను। భజనమొనరింతు రెవ్వడన్య భజనముడిగి॥ ఉ॥ కొందఱు కీర్తన ప్రియతఁగొల్తురు నన్ను దృఢవ్రతార్థులై। కొందఱు సేవ సేయుదురు కొందఱువందనకర్మతత్పరుల్। గొందఱు యోగయుక్తులయి కోరిభజింతురు భక్తియుక్తి న। స్పందమనసుకులై సుకృతసత్తములందును బొండవోత్తమా॥ వ॥ మఱియుఁగొందఱు జ్ఞానయజ్ఞంబుచేతనన్నేకత్వంబున సహస్రశీర్షుండగు విరాట్పురుషుండనియును, వ్యక్తత్వంబుచేత లక్ష్మీనారాయణాత్మకంబనియును, బహుధాత్వంబుచేత మత్స్యాది చతుర్విధశక్త్యావతారాత్మకంబనియును, విశ్వతోముఖంబుచేత బ్రహ్మరుద్రాది దేవతా సమూహాత్మకంబనియును, నుపాస్తిచేయుచుండుదురు॥ చ॥ క్రతువును విష్ణుపూజనముఁగాలనియుక్తపుఁబై తృకంబులుక్। వితతమహాధ్వరంబులును విశ్రుతమంత్రము లాజ్యముఖ్యముల్। హుతవహుఁడా హుతంబులును నొప్పఁగ సాధుబుధుండుబుద్ధిచే। సతతమునన్నె కాఁదలఁచు సజ్జన ధీరులుమెచ్చ ఫల్గునా॥ గీ॥ తల్లిదండ్రియుదాత పితామహుండు। వేద్య

పావనమోంకార విసరములును । ఋగ్యజుస్సామములు జగత్త్రిత యములును। నేనకాఁదలఁపోయి మనీషివరుఁడు॥వ॥మఱియుఁగర్మ ఫలంబును, బోషకర్తయును, నియామకుండును, శుభాశుభద్రష్ట యు, భోగసాధనంబును, హితకర్తయు, స్రష్టయు, సంహర్త యు, నాధారంబును, ఆయుస్స్థానంబును,నిధానంబును, బీజంబు ను, అవ్యయంబును, నేనెగా మహాత్ములెఱుంగుదురు॥గీ ॥ తపనశీ లుండు వర్షప్రదాతసంగ్ర । హితము నమృతంబు మృతమును నె న్నఁదగిన। సత్స్వరూపంబు మఱియునసత్స్వరూప । మేనెకాఁ జూచి ననుఁగొల్చు నిత్యతముఁడు॥సీ ॥ వేదవిద్యలచేత వెలయుమ హాత్ములు సోమపానంబున సొబగుమీఱి । పాపసంఘంబుల భస్మ ముల్ గావించు.యజ్ఞకర్మంబుల నలరఁజేసి। స్వర్గలోకమునకుఁజ య్యనమఱియేగి మన్మహనీయ సామర్థ్యమునను। దివ్యభోగంబుల దేవసమానులై రంభాది సంసర్గరతులఁదగిలి । యెంతకాలంబు తత్పుణ్యమేచియుండు। నంతకాలంబు స్వర్గంబు నధిగమించి। క్రీ డసల్పుదురే ప్రొద్దుఁగేవలముగ। నమరలోకంబుఁబొందియున్ననఘ వర్య॥ గీ॥ ఆమహాత్ములు స్వర్గంబు ననుభవించి। పుణ్యమెల్లను క్షీ ణమైపోయెనేని। మగుడియే తెంతురిమ్మాడ్కి మహిని స్వర్గ। కాము కులు పొందుదురుగతాగతములనఘ॥ గీ॥ అన్యచింతలు మనమున నడరనీక। యోగయుక్తిని ననుఁగొల్చునుత్తమునికి । విమలయోగం బు క్షేమంబు వెలయఁదాల్చి। పోషణము సేయుచుందుదుఁబుణ్య చరిత॥ గీ॥ అన్యదేవతాపూజలననఘచరిత । భక్తియుక్తినిగావిం చు భవ్యమతుల। పూజలన్నియు ననువచ్చిపొందుఁగాని । మోక్ష మియ్యను బరభోగములనుదక్కి॥ గీ ॥ యజ్ఞములకెల్ల భోక్తనై యలరువాఁడ। యజ్ఞములకెల్లఁబ్రభుఁడనై యమరువాఁడ । నేనె

కావున నన్నుఁగా నెఱుఁగనట్టి । మూఢచిత్తులు పొందరు మోక్షముల
ను॥ వ ॥ వినుము దేవతా యాజులు దేవతలను పితృయాజులు పి
తృదేవతలను భూతయాజులు గణాధిపమాతృకా ప్రభృతిభూ
తంబులను బొందుదురు. నన్ను యజించువారు పరమానంద స్వ
రూపంబున నన్నె పొందుదురు॥ క॥ ఫలమైనఁ బుష్పమైనను। జలమై
నను బత్రమైనఁ జంచద్భక్తిన్ । వెలయుచు నర్పించిన నవి। చెలఁగి
గ్రహించెదను బ్రీతచేతస్కుఁడనై ॥ వ ॥ కావున నీవు సేయు
కర్మంబులును, నీవు భక్షించు భక్షణీయంబులును, నీవు సేయుహు
తద్రవ్యంబులును, నీవు సత్పాత్రులకిచ్చు దాతవ్యవస్తువులును, నీ
వానరించు తపంబులును, మత్సమర్పితంబుగాఁ జేయుము॥ గీ॥ కర్మ
చయ నిర్మితంబులై కడఁగివచ్చు । నురుశుభాశుభముల నెల్లను
జ్జగించి । మహితసన్న్యాసయోగంబు మహిమఁ దాల్చి । నన్నుఁ
బొందంగఁగలవు ధన్యత్వమునను ॥ గీ॥ సర్వభూతంబులందును స
ముఁడనైన। నాకుఁ బ్రియుఁడును విద్వేషినరుఁడు లేఁడు । భక్తితో
డుత ననుఁగొల్చి పరగునట్టి । వారు నావారు నేనును వారివాఁడ॥
గీ॥ అతిదురాచారపరుఁడైన ననన్యదేవ । భజనమొల్లక ననుఁగొల్చి
పరగెనేని। సాధుచారిత్రుఁడని వానిఁ జర్చసేయు । మధికతరభక్తి
నిశ్చలుండని తలంచి ॥ వ ॥ వినుము దురాచారుండైన నరుండు మ
ద్భక్తుఁడయిన శీఘ్రకాలంబున ధర్మాత్ముండై పరమశాంతిఁ బొందు.
దీనసంశయంబు లేదు. దీనికిఁ గుతర్కవాదులు సందేహింతురని త
లంచి తేని నీవు నిశ్శంకుండవై భేరీమృదంగ. కాహళాదివాద్య
ఘోషపూర్వకంబుగాఁ దద్వైదవాదపరుల సభకుంజని యూర్ధ్వ
బాహుండవై యత్యంతదురాచారుండయిన నేమి విష్ణుభక్తుఁడుత్త
ముండని ప్రతిజ్ఞ సేయుము తత్ప్రతిజ్ఞ వలనఁ గుతర్కవాదులు ను

తరిఁబుమాని నన్నుగురుసిగా నాశ్రయింతురు॥ గీ॥ పాపయో
నులు మద్గతిపరులుగాని। స్త్రీలు వైశ్యులు శూద్రులుఁ దేజమెసఁ
గ।దీపితావ్యభిచారభక్తి నిగ్రహించి। పరమగతిఁబొందు దురుచు
వ్వాపాండవేయ॥ వ॥ కావున బ్రాహ్మణులును రాజర్షులునయిన పు
ణ్యాత్ములగు భక్తులు మోక్షంబుఁబొందుట కేమి యాశ్చర్యంబు? నీ
వనిత్యంబును నసుఖంబునునగు మర్త్యలోకంబునొంది తుచ్ఛసు
ఖంబులనాసింపక యాలస్యరహితుండవయి నన్ను సేవింపుము॥
సీ॥ అఖిల లోకేశ్వరుండైనట్టి నాయందు హృదయంబు నిలుపు
మాయింద్రతనయ। భక్తపరాధీనభావంబుగలనాదు భక్తుఁడవ
గుముభీభత్సయిపుడు। బహిరంతరంబులఁబాయకుండెడి నన్నుఁ
బూజసేయుము పాండుభూపతనయ॥ బ్రహ్మాదివందితపదపద్ముఁడ
గునాకుఁబ్రణతిగావింపుమీ పాపరహిత। మత్పరాయణభావంబు
మఱువకుండు। చిత్తమునయోగమెప్పుడుఁజెదరనీక। యివ్విధంబున
వర్తించితేని వేగ। జిరతరానందమయు నన్నుఁజెందఁగలవు॥

ఇది రాజవిద్యారాజగుహ్య యోగంబను నవమాధ్యాయము.

---

## దశమాధ్యాయము.

వ॥ శ్రీభగవంతుండిట్లనియె॥ గీ॥ నీకుఁబ్రియమును హితమును
నెరయఁగోరి। మరలి గోప్యమ్ములగునట్టి మాటలెల్లఁ। జెప్పెదను
విను నిశ్చలస్నేహమొదవ। నీకుఁదెలియఁగ నఖిలంబు నిర్మలాత్మ॥
గీ॥ దేవతావళి ఋషులును దేటపడఁగ। నాదుజన్మంబు లెఱుఁగ
రు నయవిధిజ్ఞ। దేవతలకును ఋషులకుఁ దెలిసిచూడఁ। గారణము
నేనగావునఁగలుషదూర॥ గీ॥ ఆదిరహితుఁడుఁ గేవలయజుఁడటం
చు। సకలలోకంబులకు నెల్లస్వామిననుచు। నెవ్వఁడేనియు మఱివ

న్నానెఱుఁగువాఁడు । మోహమందక పాపనిర్ముక్తిఁగాంచు॥ వ ॥ మఱియు బుద్ధియు జ్ఞానంబును మోహరాహిత్యంబును క్షమయు సత్యంబును బాహ్యేంద్రియనిగ్రహంబును శాంతియును సుఖంబును దుఃఖంబును జన్మభావంబును భయంబును భయరాహిత్యంబును నావలననయినవిగా నెఱుంగుము॥ క॥ తపమును దానము యశమును। నపయశమును హింసతృష్ణయలసతయుఁబరం । తపభూతకోటికెల్లను। విపులంబయి నావలన నె వెలసెంజుమ్మీ ॥ వ ॥ మఱియు భృగ్వాదిమహర్షి సప్తకంబును సనకసనందనాది చతుష్టయంబును స్వాయంభువాది మనువులును బ్రహ్మాత్మకంబగు నావలన సంజాతులై పుట్టెరి. వారివలన నీచరాచర సృష్టియుత్పన్నంబయ్యె॥ గీ॥ అధికతరనిశ్చయంబు నాయవిభూతియు యోగంబు నెవ్వఁడెఱుఁగు । నతఁడు నిశ్చలయోగంబునధివసించు । యోగియగు సందియములేదు రాగదూర॥ గీ ॥ సర్వసృష్టికినుద్భవస్థానమేను। సర్వమును నాదుమహిమచే జరగుననుచుఁ। దెలిసి జపియించుచునుమన్నె తెల్లముగను। బుధులు భావంబులోఁ బొరపొచ్చెముడిగి॥ వ॥ మఱియు నాయందుఁజిత్తంబుగలవారును, మద్గతజీవనులును, మదీయధర్మంబులు తా మెఱింగ పరులకు బోధించువారును, మత్కథామృతంబువలన సంతుష్టిఁబొంది రోమోద్గమానంద బాష్పగద్గదస్వరంబులచేత రమించువారునునై మహత్ములు ప్రవర్తింపుచుండుదురు॥ గీ॥ ఇట్లు యుక్తమనస్కులై వేఁచిన న్నుఁ । బ్రీతితోఁబూజసేయు మత్ప్రియులకేను । ననుఁబ్రవేశింపహేతువై యొనరునట్టి। బుద్ధియోగంబునిత్తును బురుషవర్య॥ గీ॥ వారియందలి సత్కృపావైభవమునఁ । బ్రబలునజ్ఞానతిమిరంబు వరుసతోఁడఁ। బాయఁజేయుచుజ్ఞానదీపంబుచేత। వారి హృదయంబుల

కు వశవర్తినగుచుండు॥వ॥ అనినవిని యర్జునుండిట్లనియె. దేవోత్తమా! పరబ్రహ్మంబును బరంధామంబును బవిత్రంబును బరమంబును నీవ. నిన్ను సహస్రశీర్షుండనియును, శాశ్వతుండనియును, దివ్యమూర్తియనియును, నాదిదేవుండనియును, విభుండనియును॥ గీ॥ పలుకు చుందురు వ్వె ఋషులెల్లఁబద్మనయన। యసితుఁడును దేవలుండును వ్యాసమౌని। దేవఋషినారదుండు నట్లు తెలిసితాము। పలుకుదురు నీవు నెలమితోఁబలుకుదట్లు॥ గీ॥ ఎద్ది నాతోడఁబలికెతిసిద్ధచరిత। యదియశేషంబు సత్యంబ యరసిచూడ। నీమహాదివ్యమూర్తిని నిర్ణయించి। దేవదానవులైనను దెలియలేరు॥ గీ॥ భూతభావన భూతేశపుణ్యపురుష। దేవదేవజగత్పతి దివ్యమూర్తి।నీమహత్త్వంబుఁ దెలియఁగనీవెకాని। యన్యజనులకు శక్యమెయరసిచూడ॥ గీ॥ ఏవి భూతులచేతనీవీప్రపంచ। మనఘవ్యాపించి యున్నాఁడవాసిభూతు। లెన్నిగలవన్నియును నాకు నేర్పరించి। చెప్పఁగాశక్తుఁడవు నీవెచెప్పవయ్య॥ గీ॥ ఇవ్విధంబుననిన్ను నేనెల్లయపుడు। చింతసేయుచుఁదెలివితోఁజెలఁగువాఁడ। నిందునందును నీమూర్తినెనఁగఁ జూచి। సన్నుతింపుదు చెప్పవేసాధుపోష॥ వ॥ అనిన శ్రీభగవంతుండిట్లనియె॥ గీ॥ ఈవిభూతియు యోగంబునేను దెలియ। విస్తరించుట కంతంబు వెలయలేదు। గానఁబ్రాధాన్యమునఁగొన్ని గణనచేసి। నీకు నెఱిఁగింతువినవయ్య నిశ్చలతను॥ గీ॥ సకల భూతాంతరంగసుస్థాయినగుచుఁ। దేజరిల్లెడువాఁడ నేఁ దెలియుమయ్య। వినుగుడాకేశతద్భూతవితతికెల్ల। నాదిమధ్యాంతరములునే నరసిచూడ ॥ వ ॥ వినుమదితిపుత్రులగు దేవతలలోపల విష్ణుండును, ప్రకాశమానంబులలోపల సూర్యుండును, మరుత్తులలోపల మరీచియు, నక్షత్రంబులలోపలఁ జంద్రుండును, నేనేకానెఱుంగుము ॥

గీ। వేదములలోపలను సామవేదమేన। దేవగణములలోనింద్రదేవుఁడేన। యింద్రియంబులలోఁజిత్తమేనసుమ్ము। భూతకోటుల చేతనస్ఫూర్తి నేన॥ గీ॥ రుద్రతతిలోపలను శంకరుండు నేన। యక్షరాక్షససమితిలో నర్థపతిని। నష్టవసువుల లోపలనగ్ని నేన। మిగులఁబొడవైన గిరులలో మేరువేను॥ వ॥ మఱియుఁబురోహితులలోపల దేవపురోహితుండును ముఖ్యుండు నైన బృహస్పతియును, సేనాధిపతులలోపల దేవసేనాధిపతియగు కుమారస్వామియును, జలాశయంబులలోపల సముద్రుండును నేనసుమ్ము॥ గీ॥ మఱిమహర్షులలో భృగుమౌని నేను। వాక్సమూహంబులోఁ బ్రణవంబు నేను। యజ్ఞములలోన జపమను యజ్ఞమేను। స్థావరంబులలో హిమాచలము నేన॥ గీ॥ సకలవృక్షములందు నశ్వత్థమేను। వీరవర దేవఋషులలో నారదుండఁ। జెలఁగి గంధర్వ సమితిలోఁ జిత్రరథుఁడ। కపిలుఁడనువాఁడనే సిద్ధగణములోన॥ వ॥ మఱియు నశ్వంబులలోనుచ్చైశ్శ్రవంబును, గజంబులలోన నమృతోద్భవంబగు నైరావతంబును, మనుష్యులలోపల మనుష్యాధిపతియగు రాజును, నే నేనసుమ్ము॥ గీ॥ ఆయుధంబులలో వజ్రమనఘ యేను। ధేనువులలోపలను గామధేనువేను। ప్రజకుఁ గారణుండైన దర్పకుఁడ నేను। వాసుకియు నేను సర్పనివహములలోన॥ గీ॥ నాగములలోననంతుండనంగ నేను। వరుణుఁడను నేను జలచరోత్కరములోన। నర్యముఁడ నేను పితృసమూహములలోన। నియమకర్తలలోపల నే నెయముఁడ॥ గీ॥ అనఘ దైత్యులలోనఁ బ్రహ్లాదుఁడేన। గణనగావించువారిలోఁ గాలమేన। సింహమేఁ జుమ్ము వరమృగశ్రేణిలోన। గరుడుఁడనువాఁడ నేఁ బక్షిగణములోన॥ గీ॥ పవనుఁడను నేన ఘనవేగపతులలోన। రాఘవుఁడ నేను శస్త్రభృద్రాజిలోన। మత్స్యసం

తతిలోపల మకరమేన। జాహ్నవియునేఁజుమీ సరిచ్ఛయములోన॥ వ॥ మఱియునాకాదిస్వర్గంబుల యాదిమధ్యావసానంబులును, విద్యలలోపలనధ్యాత్మవిద్యయును, శాస్త్రవాదజల్పవిదులలోవాదంబును నేనసుమ్ము॥గీ॥వర్ణ ములలోనకారంబు వరుస నేను। విమలగుణ ద్వంద్వమేసమాసములలోన।నక్షయంబగుకాలంబు ననఘ యేను। విశ్వతోముఖుఁడగు ధాత వెలయ నేను॥గీ॥ ఎల్ల జగములు సమయించుమృత్యువేను। భాగ్యమందంగఁగలవారి భవనమేను।స్త్రీలలోపలఁగీర్తిలక్ష్మియును వాక్కు। స్మృతియు మేధయు క్షమయును ధృతియు నేన॥వ॥మఱియు సామంబులలో బృహత్సామంబును, వేదమంత్రంబులలోపల గాయత్రీమంత్రంబును, మాసంబులలోపల మార్గశీర్షంబును, ఋతువులలోపలవసంత ఋతువును, నేనసుమ్ము॥ గీ॥ ఒనరనన్యోన్యవంచకద్యూతమేను। దీప్తతేజులయున్నత తేజమేను। జనులయుద్యోగజయములు ననఘయేను। సాత్వికావళియందలి సత్వమేన॥ గీ॥ వాసుదేవుఁడనే వృష్ణివరులలోన। నిపుణవర! పాండవులలోన నీవు నేన। మునుల లోపలనావ్యాసమునియు నేన। కవులలోపల నెల్లభార్గవుఁడ నేన॥ గీ॥ దమనకరులైనరాజులదండమేన। నెఱిజయాపేక్ష జనములనీతి నేన। గోప్య గోపనకరులలో గుణము నేన। జ్ఞానజనముల నిర్మలజ్ఞానమేన॥వ॥ మఱియు సకలభూతంబులకు బీజంబు నేన యీప్రపంచంబుమద్వ్యతిరిక్తంబుగాదుగావున॥ గీ॥ నాదుదివ్య విభూతికంతంబులేదు। గాననంతయుఁజెప్పశక్యంబుగాదు। చెప్పితినినీకుఁగొంతసంక్షేపముగను। వింటివాయర్జునవిభూతివిస్తరంబు॥ గీ॥ ఊర్జితము శ్రీకరంబునై యొప్పునెద్ది। విశ్రుతైశ్వర్య మహిమచే వెలయునెద్ది। యట్టివస్తువులనుమది నరయుమయ్య। పరగమామక

తేజాంశబలములనుచు ॥ గీ ॥ వేలువేలువిభూతులువిస్తరింప । నే ల వేర్వేర తెలియంగ నేలనీకు । నఖిలమైన ప్రపంచమేనావరిం చి । యనఘునిల్చినవాఁడనేకాంశముగను ॥

ఇది విభూతియోగంబను దశమాధ్యాయము.



## ఏకాదశాధ్యాయము.

వ॥ అనినవిని యర్జునుండిట్లనియె ॥ గీ ॥ స్వామినన్ను న నుగ్రహింపంగఁగోరి । యతులమైనట్టి కరుణఁబల్కితివిగాదె । యధికతరగుహ్యమైన యధ్యాత్మవిద్య । దానిచేనాదు మోహం బుఁదలఁగిపోయె॥ వ॥ శ్రీకృష్ణా! కమలపత్రాక్షా! భూతజాలంబు ల సృష్టిప్రళయంబులు నీచేతనైనయవిగా వింటి నాదికారణం బై యవ్యయంబగు నీమహత్త్వంబును వింటి మఱియును॥ గీ ॥ నీవుపల్కినదంతయు నిజముగాను । విశ్వసించినవాఁడనో విమల చరిత । భూరివైభవ యుతమైనపుణ్యమూర్తిఁ । జూడవాం ఛింపుచున్నాఁడఁ జూపవయ్య ॥ గీ ॥ ఆమహామూర్తిఁ జూడంగ నప్రమేయ । నేనుబాత్రుఁడ నగుదేని నీవుకరుణఁ । జూపవయ్య మహాశుభరూపమైన । యవ్యయైశ్వర్యతేజో బలాత్మకంబు ॥ వ॥ అనినవిని శ్రీభగవంతుండిట్లనియె ॥ గీ ॥ చూడునారూపములుపా ర్థ శోభితముగ । శతసహస్రంబులైనట్టి సంఖ్యఁదనరు । నఖిల విధములు గలిగి దివ్యంబులగుచుఁ । బెక్కువర్ణాకృతులతోడఁ బె రయువాని ॥ గీ ॥ రుద్రులను వసువులనుమరుద్గణంబు । నశ్వినుల నాది తేయులనలరఁజూడు । పెక్కులాశ్చర్యములు చూడువే రువేర । మునుపుచూడనియవి నాదుతనువునందు ॥ వ ॥ మఱి యు నాదివ్యదేహంబునఁ జరాచరంబగు సమస్తప్రపంచంబును

నవ్యంబగు జగత్కారణ స్వరూపంబును జగదవస్థాది విశేషం
బును జయాపజయంబులును జూడుము ॥ గీ ॥ ప్రాకృతాక్షు
లచేత నోపాండవేయ । చూడఁగా లేవు నామూర్తి శుద్ధముగ
ను । దివ్యనేత్రంబులిచ్చెదఁ దెలివిమీఱఁ । జూడు నా దేహసంపద
శోభితముగ ॥ వ ॥ అని యిట్లు శ్రీకృష్ణుం డర్జునునితోఁ బలికెనని
చెప్పి సంజయుండు ధృతరాష్ట్రునకిట్లనియె ॥ గీ ॥ ఇట్లు కారు
ణ్యాదిస్ఫూర్తి నెసఁగఁ బలికి । యోగవల్లభుఁడగు పురుషోత్త
ముండు । పార్థునకుఁ జూపెఁ బరమవైభవసుమూర్తి । రాజితై
శ్వర్య ధృతరాష్ట్రరాజవర్య ॥ గీ ॥ పెక్కు ముఖలోచనం
బులుఁ బెక్కులైన । దివ్యభూషణచయములుఁ దేజరిల్లఁ । బెక్కు
దివ్యాయుధంబులు బెరయునట్టి । యద్భుతాకారు నర్జునుం
డంతఁ గాంచె ॥ గీ ॥ దివ్యమాల్యాంబరంబులఁ దేజరిల్లు । దివ్య
గంధానులేపనదీప్తమూర్తి । నద్భుతానేకమయుఁడైన నయవ్యా
నంతు । విశ్వతోముఖుఁ జూచె నావీరవరుఁడు ॥ గీ ॥ దివిని సూర్య
సహస్రంబు తేజరిల్లు । నొక్కచాలుగఁ బ్రభవమై యొప్పెనేని ।
యతనికాంతికి సమమని యనఁగవచ్చుఁ । బ్రవిమలానందకరమైన
భావమునకు ॥ గీ ॥ అప్పుడేకస్థమైనట్టి యఖిలసృష్టి । నఖిలవిధ
ములను విభక్తమైనదాని । ననఘుఁ డీక్షించె నర్జునుం డద్భుతముగ ।
దేవదేవుని నిర్మలదేహమునను ॥ గీ ॥ అప్పుడా విశ్వమూర్తిసిన
లరఁ జూచి। విస్మయంబంది పార్థుఁడు వెఱచి మేనఁ । గంపమును
రోమహర్షంబుఁ గలుగ మ్రొక్కి । కేలు ముకుళించి పలికె నాకృష్ణు
తోడ॥ సీ॥ చూచుచున్నాఁడ నీ శోభనతనువు నీ సర్వలోకంబుల సర్వ
మైన । భూతజాలంబులఁ బుంఖానుపుంఖమై దీపింపుచుండెడి దేవ
తలను । కమలాసనస్థుఁడై కమనీయ కాంతులఁ బ్రకటించు చుం

డెక్షిపద్మభవుని। నీలకంఠునినిత్యునిర్మలచరితుని బార్వతీవల్లభుఁబర
ముపురుషు । మఱియు దివ్యులైన మహనీయ పురుషుల । సురగ
గణముఁజూచుచున్నవాఁడ । దేవదేవసకలదేవతావందిత । జ
గదధీశదేవసార్వభౌమ ॥ సీ ॥ విశ్వేశనీదగు విమలస్వరూపంబు
కడపట నెక్కడఁగానఁబడదు । బాహుసంఘంబులు పరగలెక్క
కుమీఱిసర్వాత్మదృశ్యమై చదలునిండె ।నుదరంబులెన్నియోయోప
లెక్కింపను వక్త్రింబులెన్నియో వరుసనెఱుఁగ । నేత్రంబులెన్ని
యో నీలకంఠునకైన వసముగాకున్నది వెసగణింప।నంతమెయ్యె
దియో చూడనలవిపడదు । మధ్య మేదియోనిర్ణయింపంగరాదు ।
తెలియరాకున్నయదియాది దేవదేవ। యెట్లు వర్ణింతు నీమూర్తినె
ట్లుచూతు ॥తరల॥ గదకిరీటము శంఖచక్రము కాంతులం బ్రకటిం
పఁగా । విదితతేజము చాలచూడిక్కి విస్మయంబొనరించుమీ ।
సదమలాంగము వహ్నిసూర్యుల చాడ్పునన్వెలసిల్లెనో । సదయ
నీదగుదివ్యరూపము చాలనేవినుతింపఁగాఁ ॥ వ ॥ దేవానీవక్ష
రంబగు పరబ్రహ్మంబవు ముముక్షుదేవుండవు సకలవిశ్వంబునకుఁ
బరమనిదానంబవవ్యయుండవు శాశ్వతధర్మరక్షకుండవు సనాత
నుండగు సహస్రశీర్షుండవనుట నాకుసమ్మతంబు ॥ మత్తకోకిల ॥
ఆదిమధ్యమహాంతశూన్యుననంత వీర్యసముజ్జ్వలుఁ । మోదకృ
చ్ఛశి సూర్యనేత్రుసముద్ధుతాశనవక్త్రునిఁ । వేదవేద్యుననంత
బాహుని విశ్రుతామితతేజుని । న్నాదిపూరుషుసర్వతోముఖున
ప్రమేయునిజూచితిఁ ॥ గీ ॥ అన్నిదిక్కులు నీమూర్తియాక్రమిం
చి । నిండెరోదోంతరాళంబునిర్మలాత్మ । యద్భుతంబగు నీరూ
పమలరఁజూచి । సకలలోకంబు సంతాపసాంద్రమయ్యె ॥ గీ ॥
సురలుకొందఱుశరణంబుఁజొచ్చువారు । భీతులై కొందఱంజలిఁబె

నంచువారు । సర్వమునులును సిద్ధులుస్వస్తియనుచు । సన్నుతిం పంగంజొచ్చిరి సంభ్రమమున ॥ సీ ॥ రుద్రసంఘాతంబురూఢిగా నినుఁజూచివిస్మయంబందెనోవిష్ణువర్య । యాదిత్యగణమునీయద్భు తాకృతిఁజూచి విస్మయంబందెనోవిమల తేజ । వసుసమూహంబు నీవరవైభవముఁజూచివిస్మయంబందె నో వేదవేద్య । సాధులునీ మూర్తిసరభసంబునఁజూచి విస్మయంబందిరోవిశ్వరక్ష । విశ్వదే వతలునుమఱియశ్వినులును । చిత్రమరుద్యక్షగంధర్వపతులనసు ర । సిద్ధసంఘంబునిన్నువీక్షించిమిగుల । విస్మయంబంది రేమనివి న్నవింతు ॥ సీ ॥ అనఘాత్మనీరూపమత్యంతమైయున్నదఖిల ప్ర పంచంబునాక్రమించి । పెక్కు వక్త్రములతోఁబెంపువహించి యుఁబెక్కు నేత్రములతోఁబృథులమగుచు । బాహుసంఘంబుచేఁ బరగశ్రేష్ఠతనొందియూరుసంచయముచే నొప్పమీఱి । యురు పాదపంక్తిచేనుజ్జ్వలస్ఫూర్తియై యుగ్రదంష్ట్రలచేతనుల్లసిల్లె । నిట్టిభవదీయరూపంబు నెసఁగజూచి । లోకమెల్లను నతిభీతిలోల మయ్యె । నాదుహృదయంబుభయమందెనలిననేత్ర । పుణ్యచారి త్ర దేవకీపుత్రకృష్ణ॥ వ॥ మఱియుఁబరమపురుషా! నభోవ్యాపకం బునునత్యంతతీవ్రంబునుననేకవర్ణంబును వివృతాననంబును దీప్త విశాలనేత్రంబును నగునీదివ్యమూర్తిం గాంచి నాదుచిత్తంబు భయంబునొందె ధైర్యంబువికలంబయ్యె శాంతింబొందుము॥ క ॥ కాలానలనిభదంష్ట్రా । జాలకరాళంబులైనస్వామిముఖములం । జాలఁగనిదిగ్భ్రమంబునఁ । దూలితిసుఖమాత్మలోనఁదొడరదుకృ ష్ణా ॥ గీ ॥ పోరిలోపలధృతరాష్ట్రపుత్రశతము । సూతసూతి యుద్రోణభీష్ములును రెండు। పక్షములయందుఁగలభూమి పతుల తోడ । నీముఖంబుననిప్పుడునిలిచినారు ॥ గీ ॥ పరువులెత్తుచు మీ

ముఖపటలిలోనఁ । జొచ్చుచున్నారువీరలు చోద్యముగను । నన
ఘకొందఱుమీదర్శనాంతరములఁ । గానఁబడిరిభగ్నోత్తమాంగ
ములతోడ ॥ గీ ॥ నదులయంబుప్రవాహంబులుదధిలోనఁ । జొద్య
మందంగనురువడిఁజొచ్చునట్లు । చొచ్చుచున్నారు నరలోకశూరు
లెల్లఁ । దావకీయప్రదీప్తవక్త్రములలోన ॥ గీ ॥ అగ్నియందుఁ
బతంగంబులధివసించి । హానిఁబొందెడు చాడ్పుననఖిలజనులు ।
నీదుసుజ్జ్వలముఖముల నెఱివసించి । నాశమొందుచునున్నారు
నలిననేత్ర ॥ వ ॥ దేవావిశ్వవ్యాపకాత్యంత ప్రకాశమానంబులై
నవదనంబులచేత వీరలనిశ్శేషంబుగా భక్షింపుచున్న వాఁడవు నీ
ప్రవర్తననేమియు నెఱుంగననినవినిభగవంతుండిట్లనియె ॥ మత్త
కోకిల ॥ లోకసంహృతిఁ జేయుకాలుఁడు లోకసంఘముఁద్రుం
పఁగాఁ। బ్రాకటంబుగ నీధరిత్రిఁబ్రవర్తనంబొనరించితిన్। బాకభి
త్సుత! యోధవీరుల్భఁడసంబునఁజంపఁగా । నేకవీరుఁడవీవునుం
బరుసేలచంపఁగవీరలన్॥ సీ॥ అదికారణంబున నర్జునలేలెమ్ముయు
ద్ధంబుసేయంగనుత్సహింపు । విశ్రుతకీర్తులు వెలయంగఁగైకొమ్ము
శత్రులగెల్చి వాసవతనూజ।నీవు చంపకమున్నెనిర్జరదుర్జయులైన
వీరలనేనెయ్యడఁచినాఁడ । నిదినిశ్చయముగాఁగ నెఱిఁగి నెమ్మని
దీనికొనరనిమిత్తమైయుండుమీవు। పటుపరాక్రమమున సముత్క
టబలంబు। నడరి యేతెంచునట్టి మత్తారినృపుల । మర్మభిద్దివ్యశర
పరంపరలచేత। నెడమఁగుడినేయ నేర్తువహీనశౌర్య॥సీ॥ ద్రోణుం
డు సంగరదోర్బలో దగ్రుండు భీష్ముండు శాత్రవభీష్మకరుఁడు ।
ఘనుఁడా జయద్రథుండనువాఁడు మిక్కిలి వీరులలోపల వీరుఁడన
ఘు। కర్ణుండుకురు రాజకర్ణభూషణవృత్తివిలసిల్లుచుండును విజయ
శాలి । యితరయోధాధ్యక్షులెందఱందఱును సమిద్రంగశక్తులై

మెలఁగునారు। వీరలెల్లను నాచేతవిహతులైరి। జయముచేకొ
న్ములేలెన్ము సంగరమున। కించుకయు భీతిమదిలోన నేసఁగనేలు।
జలజహితసనిభ తేజ వాసవతనూజ॥ వ॥ అనిన శ్రీకృష్ణునితో నర్జు
నుండు పల్కి-నవిధంబు వినుమని సంజయుండు ధృతరాష్ట్రునితో
మఱియునిట్లనియె॥ సీ॥ దేవేశవైకుంఠ దివ్యప్రభాపూర్ణనీదుకీర్తి
స్ఫూర్తినిఖిలజగము। హర్షించుచున్నది యనురాగమహిమచే వి
లసిల్లుచున్నది విపులముగను। భీతులై రాక్షసుల్ పెక్కు-దిక్కు-ల
కును బరువెత్తుచున్నారు బలముతఱిగి। సద్భక్తితో సిద్ధసంఘంబు
లెల్లను మ్రొక్కు-చునున్నారు మోదమలర। నగునుభావదీయమగు
సమర్థత్వమునఘ। చోద్యమెంతనియరయఁ బ్రస్తుతచరిత్ర। దేవదే
వేశలక్ష్మీశ దివ్యపురుష। భక్తవత్సలమురహరభవవిదూర॥ వ॥ దే
వా! నీవుమహాత్ముండవు బ్రహ్మదేవునికంటె శ్రేష్ఠుండవాది కర్తవ
నంతుండవు జగన్నివాసుండవు సదసత్తులగు జీవశరీరంబులకం
టెఁబరుండవాది దేవుండవక్షరుండవుపరబ్రహ్మవు నీకుబ్రహ్మేంద్రు
లు మొదలుగా నమస్కరింతురు॥ సీ॥ అఖిలదేవతలకు నాది
దేవుఁడవీవు రమణీయమూర్తివి రాజమాన్య। జన్మసంస్థితిలయ
స్థానంబులును నీవ విశ్వవేత్తవునీవ విమలతేజ। దివ్యమునులకును
దెలియంగఁదగునట్టి సర్వేశ్వరుండవుస్వామివీవ। నీచేతవ్యాప్తం
బునిఖిలప్రపంచంబు నత్యంతఫలద యనంతరూప। సర్వదేవనమ
స్కృతచరణపద్మ। భక్తలోక గృహాంగణ పారిజాత। మౌని
మానస నీరజమత్తభృంగ। దేవకీపుత్రరిపుజైత్ర దీప్తగాత్ర॥వ॥
మఱియు వాయుయమ వరుణాగ్ని శశాంకప్రజాపతులునీవ. భృ
గ్వాదులు.సృష్టికర్తలగుటంజేసి ప్రపంచంబునకుజనకులైరి. తజ్జన
కుండగుటంజేసి చతుర్ముఖుండు లోకంబునకుఁ బితామహుఁడ

న్యోఁదవీయాజనకుండవగుటంజేసి నీవీసమస్తలోకంబులకుం బ్రపితామహుండవదిగావున నీకునమస్కారంబులొనర్చెదనని వేఁడయు ॥ ఉ ॥ మ్రొక్కెదనీకునోయనఘ ముంగలవెన్క సమస్తదిక్కులన్ । మిక్కిలిభక్తితోడుతనమేయపరాక్రమవీర్యయుజ్జగం । బొక్కటలోన వెల్పలసముజ్జ్వలదీప్తులనిండెనట్టిన । వ్యక్కమనీయమూర్తిమరితాఁర్తివిమోచనపద్మలోచనా ॥ సీ ॥ ప్రాకృతసఖుఁడవన్ పామరబుద్ధిచేఁగమలాక్షునిన్నెఱుఁగంగలేక । యోకృష్ణయోధీరయోయాదవయటంచుఁబలికితి ధిక్కారభాషణముల । నఖిలప్రపంచంబునావరించి వెలుంగునీవిశ్వరూపంబునీసమగ్ర । మహిమయుఁదెలియక మందబుద్ధుఁడనైతిఁజపలచిత్తుఁడనైతిజనులలోనఁ । బ్రణయవశమునమిక్కిలి పలికెనాఁడఁ । గడుఁబ్రమాదంబుచేసేమొనోడివినాఁడ । నిట్టియపరాధజాలంబులెల్లనోర్చి । కరుణతోడుతమనుపవేకంసదమన ॥ వ ॥ మఱియునచ్యుతా ! నిన్నునప్రమేయుండని తెలియక బావయనుతలంపున నేకాంతంబున సకలజన సమక్షమంబునఁబరిహాసార్థంబువిహారశయ్యాసన భోజనంబులయందు నువిరస్కరించిన యపరాధంబులు క్షమియింపుము ॥ సీ ॥ జనకుఁడవీవయీసచరాచరంబైన త్రైలోక్యమునకును దైత్యదమన । గురుఁడవునీవెకాగురుతరంబైనట్టి విశ్వసృష్టికినెల్ల వేదవేద్య । త్రిభువనపూజ్యతఁ దేజరిల్లుగరిష్ఠ చారిత్రుఁడవునీవె జలజనయన । లోకత్రయమునందు నీకుసమానులుగలుగరు చర్చింపఁగం సదమన । యాధికుఁడెవ్వఁడునీకంటె నరసిచూడ । మంజులాలాపయప్రతిమప్రభావ । భక్తవత్సలదేవేశపరమపురుష । వాసుదేవజవాస్వనవనజనాభ ॥ వ ॥ కావునలోకత్రయకర్తవగునీకుదండప్రణామంబులాచరించెద. నాయందుఁబ్రసన్నచిత్తుఁడవై పుత్రునియప

రాధంబులు తండ్రి క్షమియించునటుల నాయపరాధంబులం క్షమియింపుము ॥ మత్తకోకిల ॥ తొల్లి చూడనిమూర్తి గావునఁ దొంగలించెను మేనునా । యుల్లముం గడుభీతి నొందెడి నుజ్జగించఁగదయ్యాయి । బల్లిదంబగు విశ్వరూపము పద్మలోచన నీదు సం । ఫుల్లపంకజలోచనంబగు పూర్వరూపముఁ జూచెదన్ ॥ తరల ॥ గదకిరీటము చక్రముఁ ఘనకాంతిచే విలసిల్లఁగా । విదితమైన చతుర్భుజంబులు విస్ఫురద్ద్యుతిమీఱనీ । సదమలాకృతిఁ జూపుమిప్పుడు సర్వతోముఖయాత్మలో । మదము వాంఛయు నంతకంతకు నుమ్మరమ్మయియొప్పెడిన్ ॥ వ ॥ అనిన శ్రీభగవంతుండిట్లనియె నర్జునా! మదీయయోగసామర్థ్యంబున నీకుఁ జూపంబడిన తేజోమయంబును ననంతంబును ననాద్యంబును నైన యీరూపంబు భవాదృశులగు భక్తులకుం దక్క దక్కిన వారలకుఁ జూపఁబడదు ॥ సీ ॥ వేదపాఠములచే విలసిల్లుపుణ్యులుఁ శ్రౌతవిద్యాపరిజ్ఞానపరులుఁ । దపముచేతనుజాలఁ దపియించుమనుజులు దానతత్పరులై నధన్యమతులు । దేవపూజలచేతఁ దేజరిల్లెడు ధీరులౌపాసనంబులనలరు వారు । రాజసూయాధ్వర రాజ యాజకులశ్వమేధాదులు యజించి మెలఁగువారు । నాదుమహనీయరూపంబు నయనములను । జూడశక్తులుగారువిశ్రుతచరిత్ర । మనుజలోకంబునందును మత్ప్రసాద । నిర్మలాత్ముఁడవైనట్టి నీవు దక్క ॥ గీ ॥ అతులమగు విశ్వరూపంబు నలరఁ జూచి । మదిని మౌఢ్యంబు వేధయుమాను పార్థ । భీతిఁ బోఁద్రోచి మిక్కిలి ప్రీతిఁ బొంది । కృష్ణరూపంబుఁ జూడుము కేవలముగ ॥ వ॥ అని శ్రీకృష్ణుండర్జునుతోడఁ బల్కెనని ధృతరాష్ట్రునితో సంజయుండు మఱియు నిట్లనియె ॥ గీ ॥ పరమపురుషుండు నరునట్లు పలికి పలికి । తనను శ్రీకృష్ణరూపంబుఁ దనరనపుడు । సౌమ్యతరమూ

ర్తిఁ దాల్చియా సర్వగతుఁడు । ధారుణీశ్వరయర్జునునూరడించె ॥
వ॥ అప్పుడమ్మహాత్మునితో నర్జునుండిట్లనియె ॥ గీ ॥ నీదు మానుష
రూపంబు నిర్మలాత్మ । సౌమ్యమగు దానిఁ జూచిన సంభ్రమము
నఁ । బరవశంబైన చిత్తంబు పాదుకొనియెఁ । బ్రకృతిభావంబు
నొందితిఁ బ్రస్తుతముగ ॥ వ ॥ అనిన విని భగవంతుండిట్లనియె ॥గీ॥
అధికతరముగ దుర్దర్శమైనయట్టి । నీవుచూచిన రూపంబు నిర్మలా
త్మ । చూడవాంఛింతురెప్పుడు సువ్విశుద్ధ । హృదయులైనట్టిదే
వతలెల్లఁ బార్థ ॥ గీ ॥ వేదములనైన యజ్ఞాదివిధులనైన । దా
నములనైన ఘనవస్తుతతులనైనఁ । జూడశక్యంబుగాకుండుఁ జువ్వె
పార్థ । నీవుచూచిన రూపంబు నిక్కముగను ॥ గీ ॥ ఇట్టిరూపంబు
తోడుత నెసఁగునట్టి । నన్ను నెఱుఁగంగ ననుఁ జూడ నన్నుఁ బొంద ।
భక్తియోగంబె తెలఁపోయఁ బరమమైన । సాధనముగాని మఱిలేదు
సాధనంబు ॥ క ॥ మదధీనకర్మకర్తయు । మదుపాశ్రయతత్పరుం
డుమను జేశ్వరభూ । తదయాళుఁడు నిస్సంగతఁ । బదిలుండగు
వాఁడు నన్నుఁ బ్రాపించుఁదగఁ ॥

ఇది విశ్వరూపసందర్శన యోగంబనునేకాదశాధ్యాయము.

---

## ద్వాదశాధ్యాయము.

వ॥ అని భగవంతుండానతిచ్చిన నర్జునుండిట్లనియె॥ గీ॥ యో
గశక్తిని భక్తిచే నొప్పుగాను । బూజలొనరించు నాతఁడు పుణ్యాత
ముఁడు । అక్షరంబగు నవ్యక్తమాచరించు । వారిలోపల నెవ్వఁడు
పరతముండు ॥ వ ॥ అనిన శ్రీభగవంతుండిట్లనియె ॥ గీ.॥ మనము
నామూర్తియందును మరుగఁ జేసి । యోగయుక్త శ్రద్ధతోఁ బూజలొన

సేఁజేయు । వాఁడెయుత్తమతముఁడునై వాసికెక్కు । సర్వవిధ
ములవాఁడు మత్సమ్మతుండు ॥ వ ॥ వినుమర్జునా! యవ్యక్తంబనిర్దే
శ్యంబక్షరంబచింత్యంబును గూటస్థంబును ధ్రువంబుననగు పరబ్ర
హ్మంబునుపాస్తిసేయుచు ॥ గీ ॥ చిత్తమునసింద్రియంబులఁజిక్క
బట్టి । సర్వగతముగ బ్రహ్మంబు సమితఁజూచి । భూతహితప
ర్తనంబునఁ బొదలువారు । నన్నుఁజెందెదువారుసూ నయవి
ధిజ్ఞ ॥ గీ ॥ నిర్గుణమునందునిష్ఠచే నిలుచువారి । కధికతరమైన క్లే
శంబునావహిల్లుఁ । బార్థవినవయ్యనిర్గుణబ్రహ్మనిష్ఠ । భూరిదుః
ఖంబుచేఁగాని పొందఁబడదు ॥ వ ॥ కావున సర్వకర్మంబులునా
యందుసమర్పించి మత్పరులై యన్యదేవతాసక్తంబుగానిచిత్తం
బుచేనన్నుఁ గరచరణాద్యవయవ సంయుక్తమూర్తిఁగాఁదలపో
యుచు షడక్షరీ, అష్టాక్షరీ, ద్వాదశాక్షరీ, ప్రభృతివైష్ణవమం
త్రోపాస్తిసేయుచు నేమహాత్ములుందురు ॥ గీ ॥ అట్టిమదధీనచిత్తు
లనహరహంబు । నుద్ధరింపుదు వేగంబ యనుబలాఢ్య! ఘోరతర
మైనమృత్యుసంసారవార్ధి । యందుమగ్నులుగాకుండనరసి నేను ॥
గీ ॥ మనమ్ము నాయందు నిలుపుచుమట్టుపఱుపు । బుద్ధియునుమద
ర్పితముగాఁబొందుపఱుపు । మట్టులైనను సందియంబింతవలవ ।
దనఘపొందెదునన్ను దేహాంతరమున ॥ గీ ॥ చిత్తమనఘాత్మ నా
యందుస్థిరముగాఁగ । జేర్పవేఱేమిమదిలోనఁజింతవలవ । దు
రువణింపక యభ్యాసయోగమునను । నన్నునొందఁగఁదలఁతువ
త్యున్నతముగ ॥ వ ॥ మఱియుయోగాభ్యాసంబునకసమర్థుండవే
నిమదర్పితకర్మంబులగు నేకాదశీ ప్రభృత్యుపవాసవ్రతంబులును,
మన్మూర్తిమైనసాల గ్రామపూజాపరిచయంబులును, మన్నామ
కీర్తనంబులును జేయుము దానివలన మోక్షంబునొందఁగలవు ॥

గీ॥ దానికిని శక్తుఁడవుగాక మానితేని । యనఘ నన్ను శర
ణ్యుఁగా నాశ్రయించి । నియతచిత్తతఁ గర్మముల్ నీవొనర్చి । ఫ
లముఁ గోరక నాయందు భారమిడుము ॥ వ ॥ వినుము యోగా
భ్యాసంబునకంటె జ్ఞానంబు శ్రేష్ఠంబు. జ్ఞానంబునకంటె ధ్యానం
బు విశేషంబు. ధ్యానంబువలనఁ గర్మఫలత్యాగంబగు. ఫలత్యా
గంబున మోక్షంబు సిద్ధించు ॥ గీ ॥ సత్త్వములయందు నోరులందు
సములయందు। నలుగమియు మైత్రికృపయును నమరనిలిపి। నిర్మ
మత్వమహంకారనిరసనంబు। క్షమయు సుఖదుఃఖ సమతయు జ
రపవలయు॥ గీ॥ ఎంతగలిగిన నంతతో సంతసిల్లి । యప్రమత్తతని
యతాత్ముఁడై కడంగి। బుద్ధి మనమును నాయందుఁ బొందుపఱుచు।
దృఢ సునిశ్చయుఁడతఁడు మత్ప్రియుఁడు సువ్వె॥ వ ॥ మఱియు నె
వ్వనివలన లోకంబు భయంబుచేత సంక్షోభంబు నొందకుండు నె
వ్వఁడు భయాది నిమిత్తంబులకుఁ జిత్తంబున సంక్షోభంబు నొంద
కుండు నట్టిభక్తుండు నాకుఁ బ్రియుండు॥ క ॥ అనపేక్షుఁడు దాసీ
నుఁ డనఘుత రావ్యధుఁడు దక్షుఁ డఖిలోద్యతనో। జ్ఞనపరుఁడు శు
చియైనగుమ।ద్ధునతరభక్తుండు నాకుఁ గడుఁ బ్రియుఁడు సుమీ॥ వ॥ మ
ఱియుఁ బ్రియావాప్తియందు హర్షంబును నప్రియావాప్తియందు
దుఃఖంబును నిష్టార్థనాశనంబునందు శోకంబును నప్రార్థనంబందుఁ
గాంక్షయుఁ బుణ్యపాపంబులందు నాసక్తియు లేనిభక్తుండు నా
కుఁ బ్రియుండు ॥ గీ ॥ శత్రుమిత్రులు శీతోష్ణసౌఖ్యదుఃఖ । ములు
ను మానావమానములలరఁ దనకు। సమముగావించి సంగవర్జనమొ
నర్చి । తనరు మద్భక్తిపరుఁడు నాకును బ్రియుండు॥ వ ॥ మఱియు నిం
దాస్తుతులయందు సముండును మౌనవ్రతపరాయణుండును నెం
తమాత్రంబు దైవనియుక్తిని బ్రాప్తంబగు నంతన సంతుష్టుండగు

నతండును నాయందు స్థిరబుద్ధియును నగుభక్తుండు నాకుఁబ్రి యుండు॥గీ॥ అనఘులెవ్వారలిట్టి ధర్మామృతంబు। నుదినుపానించు శ్రద్ధాసమగ్రచిత్తు। లట్టివారలు మత్పరులనఘవినుము । నాకు భక్తులు మిక్కిలి నాకుఁబ్రియులు॥

ఇది భక్తియోగంబను ద్వాదశాధ్యాయము.



త్రయోదశాధ్యాయము.

వ॥ అని మఱియు భగవంతుండిట్లనియె॥ క ॥ ఈదేహము కుంతీసుత। యాదరమతితోడ క్షేత్రమనుచు నెఱుఁగుమీ । యీదే హస్థితుజీవుని । నాదట క్షేత్రజ్ఞుఁడనుచు నరయుము మదిలోఁ॥ క॥ క్షేత్రంబులందు నర్జున। క్షేత్రజ్ఞునిఁగాఁగ నన్ భజింపుము క్షే త్ర। క్షేత్రజ్ఞ పరిజ్ఞానము । వృత్రహసుత నన్నెఱుంగు విధమగుఁ జుమ్మీ॥వ॥ మఱియు నాచేతఁజెప్పంబడిన క్షేత్రంబు జడస్వభావం బుగల యది; యిచ్ఛాదిధర్మంబైనయింద్రియాది వికారంబులతో డఁగూడినయది; ప్రకృతి పురుషులవలన స్థావరజంగ మాదులచేత భిన్నంబయినది; మదీయోక్తంబయిన క్షేత్రజ్ఞుఁడెవ్వఁడతండును నే ప్రభావంబున ప్రసన్నుండగు నదియంతయు సంక్షేపరూపంబు న నీకుఁ జెప్పెదవినుము ॥ గీ ॥ బ్రహ్మసూత్రపదాగమపటలిచేత । ఋషులచే హేతుమద్వచశ్శ్రేణిచేత । నిశ్చయంబులచేతను నిర్ణ యింపఁ। బడిన యర్థంబుఁజెప్పెదఁబార్థవినుము॥ వ ॥ మఱియుఁ బృథివ్యాదిపంచభూతంబులును నహంకారంబును బుద్ధియు నవ్య క్తంబును నింద్రియ దశకంబును మనంబును నింద్రియ గోచరంబ గు శబ్దాదివిషయపంచకంబునుం జేరి చతుర్వింశతితత్వంబులవ్వే॥

గీ॥ సుఖము దుఃఖంబు ద్వేషంబు సొరిదినిచ్ఛ । దేహమును జేత
నంబును ధృతియుఁగూడి । తనరునా చతుర్వింశతితత్త్వములును।
ననఁగ నవికారమగు క్షేత్రమనఁగఁబరగు॥ వ ॥ వినుము జ్ఞానసం
పన్ను నకుఁదాఁ బొగడుకొనమియు దంభవర్జనంబును నహింస
యు క్షమయు నవక్రత్వంబును మాతృపిత్రాచార్యాతిథి పూజనం
బును బాహ్యాభ్యంతర శౌచంబును నారాయణారాధనంబునం
దు స్థైర్యంబును నింద్రియ మనోబుద్ధ్యహంకారాత్మకంబగు దే
హంబునందగులకుండ నిరోధించుటయుఁగలుగవలయు॥ ఉ॥ ఇంద్రి
య సౌఖ్యసంపదల నేమియుఁగోరక వీతరాగుఁడై । సాంద్రయ
శుండహంక్రియల చక్కటిఁబోవక దూరవర్తియై।యింద్రజ మేని
కిం జరయు మృత్యువు జన్మము వ్యాధులుఁ విని। స్తంద్రత దుఃఖదో
షములుఁజాలఁగఁగల్గుటెఱుంగఁగాఁదగుఁ॥ గీ॥ పుత్రదారగృహం
బులపొందువిడిచి। వారిసుఖదుఃఖములకును వశుఁడుగాక । యిష్ట
సంప్రాప్తియందు ననిష్టలబ్ధి । యందు నేప్రొద్దుసమతచేనలరవల
యు॥ ఉ॥ పూనియనన్యయోగమును బొందెడువాఁడు మదీయభ
క్తితో। ధ్యానపరాయణుండగుచుఁ దత్పరతన్నుఁబూజ సేయు
చుఁ । మానవవర్గమందరతి మచ్చికమాని వివిక్తదేశసే। వా
నిరతింబ్రవర్తిలుటవాసవనందనజ్ఞానికొప్పగుఁ॥ వ ॥ మఱియు న
ధ్యాత్మజ్ఞాననిత్యత్వంబును దత్త్వజ్ఞానంబునకుఁబ్రయోజనంబయి
న మోక్షంబు సర్వోత్కృష్టంబని యాలోచించుటయుఁగలిగిన
యతండు జ్ఞాని. యీగుణంబులులేని వాఁడజ్ఞానియనంబడును॥గీ॥
ఎద్ది తెలిసినచో మోక్షమెసఁగఁగల్గు। నట్టి బ్రహ్మంబుఁదెలిపెదనల
రనీకు। నదియు నారాయణీయమై యతిశయిల్లుఁ। బ్రకృతిపురుష
లకరిపెను బరతరంబు ॥దండకము॥పార్థా! మహావైరి సంహర్త!

గోత్రారిపుత్రా ! జగజ్జైత్ర ! సుజ్ఞానపాత్రా ! సుధాధామ స
ద్గోత్ర! విశ్వంభరాభర్తకీవిశ్వ మెంతేనియుంబాణి పాదంబులై నే
త్రపద్మంబులై యుత్తమాంగంబులై మానస శ్రోత్రజాలంబులై
యొప్పు నాయున్న తస్ఫూర్తిచే లోకమావృత్తమయ్యుంబ్రవర్తి
ల్లినా విశ్వ సృష్ట్యాదిమధ్యావసానంబులన్ దోఁచి యాద్యంత
శూన్య ప్రభావంబుసంధిల్ల వర్తిల్లునాపూర్ణరూపంబు సౌమ్యం
బుబ్రహ్మాదులు నేరరెన్నంగఁ దద్దేవతా ధీశుఁజూడంగనేత్రంబు
లున్ లేవు తన్నామధేయంబులున్ బ్రహ్మరుద్రామరశ్రేణికిన్ లేవు
తన్మూర్తిసత్యంబజాడ్యం బనంతంబునానొప్పు నాదేవదేవేశుఁడే
సృష్టికాంక్షాపరత్వంబునన్ వేయుమూర్ధంబులున్ వేయు
నేత్రంబులున్ వేయుపాదంబులుందాల్చి భవ్యద్విరాడ్రూపమై
యుద్భవంబంది విశ్వంబు మాచ్ఛాదనంబై ప్రవర్తిల్లి శశ్వత్తరంబైన
యాత్మాభిధానంబునుంబొంది దాశాంగుళాకారతం బొల్చి
భూతంబుభవ్యంబుఁగావించి తానంతకున్ హేతు భావంబు చే
తం బ్రవర్తిల్లు నాదేవుచేసృష్టి శోభిల్లు నాపుండరీకాక్షుఁడానంద
సంపూర్ణుఁడై యొప్పి యుద్యన్మహాస్ఫూర్తిమైనట్టి శ్రీలక్ష్మిఁగా
వించి మాహాత్మ్యసంపత్తివిశ్వంబుపాదంబు మోక్షంబు పాద
త్రయంబై ప్రవర్తిల్లఁగాఁజేసి విశ్వంబుఁగావించి సంరంభియై కొం
త శీఘ్రంబునం గొంతశాంతంబునం జేసి యాపుణ్యచారిత్రుఁడే
విశ్వ సంధాయియైనట్టి జీవాభిమానంబుతోనొప్పు రాజద్విరా
ణ్మూర్తిఁగల్పించి యామూర్తివిశ్వంబుతోఁగూర్చి భూమిన్ బుర
శ్రేణిఁగల్పించి తోడ్తోహవిన్ సృష్టిగావించి యాయజ్ఞకర్మంబులే
దేహమైయున్న గీర్వాణులంజేసి పార్థా వసంతంబుఁగల్పించి
యిధ్మంబుగావించి పార్థా శరత్సృష్టిఁగావించి తోడ్తోహవిర్జాల

ముం జేసి యాసప్తసంఖ్యాతభాస్వత్పరిధ్యాళిఁగావించి త్రిస్సప్త దీప్యత్సమిత్కల్పనల్చేసి యాదేవదేవుండనేకామరశ్రేణిఁ గల్పించి పుంస్త్వంబుతోనొప్పు నుద్యత్పశుప్రాతముల్ జేసి యాయగ్నిబర్హిస్స్థలం బ్రోక్షణశ్రేణియజ్వల్ సృజించెన్ మహాదేవుఁడాకర్తచే దేవతాసాధ్యజాలంబులం దృప్తిఁ బొందించియాజ్యంబుఁగల్పించియవ్వాయు సర్గంబుఁగావించి పార్థాపశుప్రాతముల్ సర్వసంతుష్టిఁ గావించి ఋగ్వేదముల్ సామముల్ చేసిరద్దేవుదివ్యాననం బెద్దిబాహుద్వయంబెద్ది యూరుద్వయంబెద్ది పాదద్వయంబెద్ది యాదేవునాస్యంబునన్ బ్రాహ్మణుల్ బాహులన్ క్షత్రియుల్ వైశ్యులూరుప్రదేశంబులన్ శూద్రులున్ మేటి పాదంబులంబుట్టి రాదేవుచిత్తంబులో లోకజాలంబనేకంబుగాఁబుట్టె నాదేవు సామర్థ్యమిట్లిప్రవర్తిల్లె నీలోకనిర్మాయియైనట్టి దేవుండుసూర్యప్రభాభాసియైయంధకారంబుసంధిల్లకుండం బ్రవర్తిల్లె నీసృష్టికిన్నామ కర్మాదులంజేసి ధాతల్ బురస్కృత్యుఁగాఁజేసి యీసృష్టిగావించు నద్దేవుసమ్యక్స్వరూపుల్ మహాధీరు సాధింపనీకర్మమేకాని యన్యంబులున్ దేవుతద్దేవతాధీశునింగూర్చి యజ్ఞంబుఁగావించి దివ్యాళిస్వర్గస్థులైనట్టి భూదేవతల్ యజ్ఞకర్మంబుఁగావించి యద్దేవలోకంబునుం జెందిసౌఖ్యంబులంబొంది రాదేవుఁడా భూమి విశ్వంభరాకారముంజేసికూర్మాకృతిం భారముందాల్చె నాదేవుగర్భంబునన్బ్రహ్మ వర్తిల్లె నేస్వామికాజన్మముల్లేక జన్మంబులోఁగర్మజాలంబు లధ్యాత్మవేత్తల్పరీక్షింతురే దేవుఁడీలోక సంతృప్తికై జన్మముల్దాల్చి సౌఖ్యంబుదుఃఖంబునుం జెందు నేస్వామికీ లక్ష్మియున్ భూమిధర్మార్థ కామాళికిన్ లోనుగానుండునద్దేవుసు శ్లోకముల్ బ్రహ్మరుద్రాది దేవాళి కీర్తింపభక్తాళి తేజోమయంబైనలోకంబు నందుండు నాదేవునిన్

నిత్యునిఁ సత్య సంకల్పునిఁ సర్వకల్యాణునిందుఃఖ సంహారకుఁ సన్నుతింతుఁ మదిఁ*॥గీ॥విషయగుణములనన్నిటి వెలయఁజేయు। విషయగుణవర్జన క్రియావిలసితుండు। సక్తిలేక ప్రపంచసంసక్తుఁడగుచు। గుణియునిర్గుణియునుగాక ప్రణుతికెక్కు॥ వ॥ మఱియు భూతంబులయంతరంగ బహిరంగంబులును జరాచర సృష్టియు ననంతుండత్యంత సూక్ష్ముండుగావున విజ్ఞేయుండును నజ్ఞానులకు దూరస్థుండును విజ్ఞానులకు సమీపస్థుండునునతండ ॥ గీ ॥ ప్రాణులకుఁదానభిన్నమైపరగుచుండుఁ । ప్రాణులందును భిన్నమై పరగనుండు । జనన మొనరించుఁబోషించు సంహరించుఁ । గణుకఁ దన్మూర్తి మదినెఱుఁగంగవలయు ॥వ॥ మఱియు సూర్యాగ్ని చంద్ర తేజంబులఁ బ్రకాశింపఁజేయువాఁడును శాస్త్రజన్యంబగు జ్ఞానంబు తానమైనవాఁడును సత్త్వగుణంబున జ్ఞేయుండైన నారాయణుండును నమానిత్వాదంభత్వ ప్రభృతి లక్షణ జ్ఞానంబుచేతఁ బొందఁదగినవాఁడును సర్వ భూతహృదయస్థుండును నగువాఁడతండు ॥ గీ ॥ ప్రకృతి పురుషులలోనుండుచార్థనాదు। శక్తియును నాదిమైనయంశంబుఁగాన। గుణములనువికారంబులఁగురుకులీన । ప్రకృతిచేనైనవానిఁగాఁబరగనెఱుఁగు॥ వ ॥ వినుము కార్యంబగు దేహంబునకును గారణంబగు సుఖదుఃఖ సాధనేంద్రియంబులకుంబ్రకృతి కర్తృత్వంబునందు హేతువని చెప్పంబడు జీవుండు ప్రకృతిజన్యంబగు సుఖదుఃఖంబులకు భోక్తయై యుండియుఁబ్రకృతి సంధానంబు గలుగుటంజేసి భోక్తృత్వంబునకు హేతువని చెప్పంబడును॥ సీ॥ పురుషుండు ప్రకృతితోఁబొందుఁజేయుటఁజేసి ప్రకృతి వశంబునఁ బ్రభవమొంది । సుఖమును దుఃఖంబుఁబొలయక యేప్రొద్దుననుభవింపుచునుండు ననఘచరిత।

---

* ఈ దండకములోని విశేషభాగము పురుషసూక్తమునుండి గ్రహింపఁబడినది.

యుత్తమయోనులనుద్భవించుటకును నీచయోనులఁబుట్టి నెగడుట
కును। సుకృతదుష్కృతములసొరిదిఁగావించుటకింద్రియసంఘంబు
హేతువరయఁ। గానజీవుండు ప్రకృతితోఁగలిసియుండుఁ । జిత్ర
మగుదండధరుబాధఁజెందునప్పు। డినుముతోఁదాఁగూడినయనలు
మాడ్కిఁ। దనుజు దుఃఖంబునొందెడు జననిపోల్కి॥వ॥వినుము స
మీపంబున సాక్షిమాత్రుండునై ప్రవర్తించువాఁడును సన్నిధిమా
త్రంబుచేతను గ్రాహకుండును గర్తయు భోక్తయు మహేశ్వరుం
డును బరమాత్ముండునని చెప్పంబడు పురుషుండు దేహస్థుఁడై
యుండియుఁ బ్రకృతిగుణంబులతోఁ యుక్తుండుగాఁడు॥ గీ॥ ఇవ్విధం
బునఁబురుషుని నెవ్వఁడెఱుఁగుఁ । బ్రకృతి నెవ్వఁడు సుఖదుఃఖ భరి
తుఁగాఁగ। నెఱుఁగునతఁడెట్లువర్తించు నెపుడుఁబార్థ। మగుడఁబు
ట్టువులేక సమ్మదమునొందు॥ వ॥ కొందఱు విశిష్టమతులుపురుషుం
డగువాసుదేవుని ధ్యానంబువలనఁ దమదేహంబునందు శుద్ధంబగు
మనంబుచేతంజూతురు కొందఱు సాంఖ్యంబున నఖండదర్శనపరు
లై బాలోన్మత్తపిశాచ చిహ్నంబులవర్తింతురు కొందఱష్టాంగ
యోగంబులచేత నారాధింతురు కొందఱు హృదయస్థుండయిన
పరమపురుషుని నిరంతరావలోకనంబు సేయుచు వేదోక్తకర్మం
బులాచరించి యాతనికి సమర్పణంబు సేయుదురుమఱియును॥ గీ॥
ధరణిసామాన్య భక్తులుగురుముఖోక్తిఁ। దనరిహరిపూజఁగావిం
తురనఘచరిత। దానసంసారనీరధిఁదాటివారు। మెల్ల మెల్లనె మో
క్షంబుకొల్లగొంద్రు॥గీ॥ స్థావరముజంగమముననుసంజ్ఞలొదవఁ।
బ్రభవమొందెడు వేళలఁబాండవేయ । జ్ఞానసంయుక్తచిత్తుఁడు
నాశమొందఁ। డనుచుఁదెలివితోఁజూచినయదియచూపు॥ వ॥ మఱి
యు సమస్తభూతంబులందును వాసుదేవుండు సమత్వంబుననుం

డునని యెవ్వఁడు చూచునతండు యోగంబుచేత జీవునినవిద్యా సంకలితునిం జేయక విముక్తునిం జేయు॥ గీ॥ కర్మములకెల్లఁ బ్రకృతయే కర్తయనుచు। శోభితంబుగ నెవ్వఁడు చూచుచుండుఁ। గర్మ గాఁడని జీవునిఘనతఁ జూచు। నమ్మహాత్ముఁడు చూచిన యదియెచూపు॥ వ॥ మఱియుఁ బ్రకృతి ప్రళయంబునందుఁ జరాచరసృష్టి తనయందుఁ జెందిన దానిఁ గాఁ జేయునని యెవ్వఁడుచూచుఁ బ్రకృతివలన సృష్టికాలంబులందుల భూతంబులు విస్తరిల్లునని యెవ్వఁడు చూచునతండు బ్రహ్మంబునొందు ॥ గీ ॥ సర్వగతమైన గగనంబు సౌమ్యవృత్తి। వానిలోపల లిప్తంబుగానియట్లు। నిఖిలదేహంబులందును నెఱివసించుజీవుఁడందులలిప్తతఁ జెందకుండు॥ గీ॥ఒకఁడగు సూర్యుఁడాకాశముపగమించి। సకలలోకమువెలిఁగించు సామ్యమునను। దేహిదేహంబు సర్వంబుఁదేజరిల్లఁ జేయు దేహగతుండునై సిద్ధమనఘ॥గీ॥ ఆదిశూన్యుండు పరమేశుఁడజుఁడుఘనుఁడ। నవ్యయుఁడు నిర్గుణుఁడునైన యట్టిజీవుఁ। డనఘ దేహంబులోనఁ దా నధివసించి। చేయకుండును లిప్తతఁ జెందకుండు॥ గీ॥ అరయఁగను దేహజీవుల యంతరంబు। ప్రకృతిచే ముక్తిజీవుఁడుపడయు తెఱఁగు। జ్ఞానదృష్టిని జూచునమ్మానవుండు। భూరికైవల్యసౌఖ్యంబుఁ బొందుఁ బార్థ॥

ఇది ప్రకృతి పురుష విభాగయోగంబను త్రయోదశాధ్యాయము.

---

## చతుర్దశాధ్యాయము.

వ॥ అని మఱియు శ్రీభగవంతుండర్జునునకిట్లనియె॥ గీ॥ చెప్పెదను జ్ఞానమార్గంబు శ్రేష్ఠతరము। పరమసుజ్ఞానమిష్టశోప్పార్థనీకు। దేనినెఱిఁగినమునులెల్లఁదేజరిల్లి। ముక్తిఁబొందిరి సంసార

మోహ మెడలి॥ గీ॥ ఇట్టిసుజ్ఞానసాధనం బెఱుఁగుజనులు । నాదుస ద్గతిఁ జెందిరినయచరిత్ర। జననమందరువిను బ్రహ్మసర్గముననను । బ్ర ళయదుఃఖంబునొందరు ప్రాభవమున॥ గీ॥ ప్రకృతిపత్ని స్వరూ పమై పరగునాకు। దానియందు మదంశంబుదగులుపఱుప। బ్రహ్మ రుద్రాది దేవతాప్రముఖమైన। సకలభూత ప్రపంచంబు సంభవి ల్లు॥ గీ॥ సకలయోనుల వివిధమై సంభవించు। భూతజాలంబునకు నెల్లఁబురుషవర్య। ప్రకృతిజనని స్వరూపమైపరగుచుండుఁదలఁప బీజప్రదుండైన తండ్రి నేన॥ వ॥ మఱియుఁ బ్రకృతిసంభవంబులగు సత్వరజస్తమోగుణంబులు దేహంబునందునున్న యవ్యయుండగు జీవుని స్వకార్యంబులకు సుఖదుఃఖమోహంబులచేత బద్ధునింజే యు॥ గీ॥ రజము రాగాత్మకంబది ప్రబలతృష్ణ । వలనసంగంబువ ల్లభవంబునొందుఁ। గర్మసంగంబుచేతనుత్కటముగాఁగ । బద్ధుఁ జేయును జీవునిఁబాండుతనయ॥వ॥ మఱియుసత్వగుణంబు శోకా దికారణంబులు గలిగినను వాని వెంబడింబడఁజననీక జీవునిసుఖయు క్తునింజేయుఁదమోగుణంబు జ్ఞానాది కారణంబులుగలిగినను ప్ర మాదంబునంజీవునిం బ్రవర్తింపంజేయు మఱియుఁదమోగుణంబా లస్యంబునంబ్రవర్తింపఁ జేయునదియునుంగాక ॥ గీ ॥ తమము ర జమునుద్రోచిసత్త్వంబు పొడము। సత్త్వతమములఁద్రోచిరజంబు పొడము । సత్వరజములఁద్రోచి వాసవతనూజ । తమముపొడ మును వినుమదృష్టమునఁజేసి॥ క॥ జ్ఞానంబింద్రియపదమున । మా నుగదీపించు నేని మహితయశోర్థి। వానింబ్రవృద్ధసత్వా । నూనగు ణాధారుఁగాఁగనూహింపుమదిక॥ వ॥ మఱియు రజోగుణప్రవృ ద్ధతముండగువానికి లోభవృత్తియు గృహారామక్షేత్రనిర్మాణో ద్యోగంబును సంకల్పవికల్పాసక్తియు దృష్టమాత్రంబులగు సకల

వస్తువులందును సంగ్రహేచ్ఛయుంగలిగవర్తిల్లు॥ సీ॥ అవివేకయు క్తుండైయడంగియొకొ్కకవేళ సదసద్వివేకతసలుపకుండు। నుద్యో గహీనుండైయుండియొకొ్కకవేళంగర్తవ్యమేమియుం గానకుండు। వివిధవిధాజ్ఞానవికలుండై యొకవేళ మోహవిభ్రాంతిచే మునుం గుచుండు। దుష్టసాంగత్యంబుతోడరి యొకొ్కకవేళ సజ్జన సం ఘంబుజతనురోయు। నిట్లువరుండు తమోగుణంబెంతయేని। వృద్ధిం బొందిన నాగమవిధినియుక్త। కర్మదూర తమఃకర్మకలితుండగు చు। సంచరించును గురువంశ జలధిచంద్ర॥ క॥ రాజసుండు మర ణమునకును। భాజనమైపిదప మనుజభావమునొందున్। భూజగ తిందామసుండువి। భ్రాజితభుజశౌర్యపొందుంబశుభావంబున్॥ గీ॥ సత్వగుణవృద్ధిగలిగిన సజ్జనుండు। మరణకాలంబునను దానిమహి మవెలయ। విమలమైనట్టి బుధయుక్తవిమలలోక। మాలవసించును గల్మషములనుద్రోచి॥ గీ॥ ఘనతరసుఖంబుసాత్విక కర్మమునను। గఠినదుఃఖంబురాజస కర్మమునను। గౌరవోత్తమ తామసకర్మ మునను। నరయ నజ్ఞానమునుఫలంబయ్యెంజుమ్ము॥ గీ॥ సత్త్వగుణ మున జ్ఞానంబు సంభవించు। లోభమొదవురజోగుణలాభమునను। మోహమజ్ఞానముంబ్రమాదమును జనించుం।బాండవేయతమోగు ణప్రాప్తివలన॥ గీ॥ ఉర్ధ్వలోకంబున వసించునురుతరంపు।సత్త్వ గుణమున వర్తిల్లుసజ్జనుండు। రాజసుండు మర్త్యలోక సంప్రా ప్తినొందుం। దామసుండుపొందు నరకంబుతథ్యమిదియు॥ వ॥ మ ఱియు వివేకుండైన భక్తుండు సత్వరజస్తమోగుణంబులు కర్మా ధీనంబులుగాని కర్తయొకండు లేడని తలంచు నెప్పుడెప్పుడు గు ణంబులకంటె జీవునినన్యుంగా నెఱుంగునప్పుడె మద్భావంబునొం దు॥ గీ॥ ప్రాకృతములగుగుణములు పాయంద్రోచి। విష్ణునవ్యయు

నాత్మలో వెలయఁజూచు। నతఁడు మోక్షంబునొందు నోయనఘచ
రిత। జన్మమృత్యుజరాదుఃఖజలధిఁగడచి॥ వ॥ అనినవిని యర్జునుం
డిట్లనియె॥ క॥ ఏచిహ్నంబుల గుణములఁ। బాచి ప్రవర్తించు దే
హి పరగఁగవాఁడే। యాచారంబుననడుచును। నాచరణగుణంబు
లెట్టులలవడఁబాయుఁ॥ వ॥ అనియడిగన శ్రీభగవంతుండిట్లనియె
గుణాతీతుండగు యోగీశ్వరుండు సత్త్వాదిగుణ కార్యంబులగుణ
ప్రకాశవృత్తి మోహంబులఁబొందినప్పుడు ద్వేషంబునొందఁడు
తద్గుణకార్యంబులు నివృత్తంబులైన యప్పుడు సంతసింపఁడు॥ క॥
గుణకృత సుఖదుఃఖంబుల। నణుమాత్రముఁజలన మొందకవిమెల్ల
నుద। ద్గుణకార్యంబులెయనుచును। బ్రణతుండగు దేహిసాక్షిభా
వముచేతఁ॥ గీ॥ సౌఖ్యదుఃఖంబులందును సదృశబుద్ధి। గలిగిసమ
లోష్ట పాషాణకాంచనంబు। నభినుతియునింద ప్రియమును నప్రి
యంబు। సమముగాఁజూచునట్టి వాఁడమరయోగి॥ వ॥ మఱియు
మానావమానంబులయందును మిత్రామిత్ర పక్షంబులయందును
సముండై సకలోద్యోగపరిత్యాగియగువాఁడు గుణాతీతుండని చె
ప్పంబడును॥ గీ॥ అన్యదేవతా గణముపైనాసవిడిచి। నన్నుఁబూ
జించుచుండు మానవుఁడుపార్థ। ప్రకృతిగుణసంగవర్జనపరతనొం
ది। బ్రహ్మభావంబునకుఁజాలఁబాత్రుఁడగును॥ గీ॥ ముఖ్యముగనవ్య
యంబైన మోక్షమునకు। ధన్యపరశాశ్వతంబైన ధర్మమునకు।
సంతతై కాంతికంబైన సౌఖ్యమునకు। దీప్తమగు బ్రహ్మమునకుఁ
బ్రతిష్ఠనేనె॥

ఇది గుణత్రయ నిరూపణ యోగంబను చతుర్దశాధ్యాయము.



పంచదశాధ్యాయము.

వ॥శ్రీభగవంతుండిట్లనియె॥గీ॥ఊర్ధ్వమూలమధశ్శాఖమొనరన
వ్య। యంబునామ్నాయచయపర్ణమనఁగఁబ్రౌఢి। నెసఁగునశ్వత్థవృ
క్షంబు నెవ్వఁడెఱుఁగు । నతఁడు వేదార్థసంవేదియనఁగఁబడును॥
వ॥ మఱియు నాసంసారవృక్షంబునకు సత్త్వాదిగుణప్రవృద్ధంబు
లును విషయప్రవాళంబులునునగు బ్రహ్మాది పిపీలికాంతసుకృతదు
ష్కృతజీవ శాఖలూర్ధ్వలోకంబునను నధోలోకంబునను వ్యాపిం
చు దానికి నధఃప్రవృత్తులగు రాగద్వేషాదిమూలంబులుకర్మానుబ
ద్ధంబులై మనుజలోకంబునఁ గ్రిందనుమీఁదను బ్రవర్తించు ॥ ఉ ॥
దీనికి నాదియంతనుఁ బ్రతిష్ఠయురూపము మర్త్యులెవ్వరుం। గా
నరు గూఢమూలమిది కౌరవవంశజవిస్ఫురత్కరం। బైనయసంగ
శస్త్రమున నార్య వరేణ్యుఁడు నిశ్చలాత్ముఁడై । దీని దృఢంబుగాఁ
దునిమి దీపితమోదమునొందునిచ్చలుక్॥ సీ॥ ఆమీఁదదానికి నాశ్ర
యభూతమై వర్తించుచుండెడి వనజనాభుఁ। దనుఁజెందుభక్తసం
తతికిఁబునర్జన్మ పరిహారమొనరించు పరమపురుషు । వెదకంగవల
యునేవిశ్వ రక్షకుచేత నరయఁబురాతనమైనయట్టి। సంసారవృ
క్షంబు సంభవంబై చాలవిస్తారమును బొందెవిశ్రుతముగ । నట్టి
వేదాంత వేద్యునినాదిపురుషు । సర్వలోకైకవంద్యుని సర్వసా
క్షిఁ। బద్మలోచనుదేవేశుఁబరమపుణ్యు । శరణుపొందెదననుచును
సజ్జనుండు॥ సీ॥ మానంబుచేతను మసలకయే ప్రొద్దుమోహంబు
చేతను మొక్కపోక । పుత్త్రాదిసంసర్గభూరిదోషమడంచి య
ధ్యాత్మవిద్యచేనతిశయిల్లి। కామంబులన్నియుఁగడపలఁగావించిసు
ఖదుఃఖనామ విస్ఫూర్తిగలుగు । ద్వంద్వంబులేమియుఁ దనయం
దుఁజొరనీక విజ్ఞానసంపత్తి వెలయనొంది । సంచరించు మహా

ష్టుబడచచ్చి చచ్చి। పుట్టిపుట్టి విపన్నతఁబొందకుండు। రట్టిసుస్థాన
మైన యవ్యయపదంబుఁ । జేరిభూలోకమునకును రారు పార్థ ॥
గీ॥ ఎచట సూర్యప్రకాశంబులెసఁగకుండు। నెందునన లేందుకాం
తులుఁ జెందకుండు। నందువర్తించి తిరిగిరా రనఘభువికి। నదిమె
మామకనిర్వాణమని యెఱుంగు ॥ వ ॥ మఱియు నాయంశంబును
సనాతనుండునునగు జీవుండు ప్రళయంబులయందు నాయందులీ
నుండగుచుఁ,దన్నుఁబరివేష్టించిసమనంబునుదశేంద్రియంబులనుప్రా
ణంబులందీసికొనివచ్చి జీవలోకంబునందు సృష్టికాలంబున సంసా
రియై వర్తించు॥ గీ॥ దేహముననుండు జీవుండు దేహమునకు। నే
గుతఱిసింద్రియాదుల నెల్లఁగొనుచుఁ । బోవువాయువు పుష్పంపు
తావిఁగొనుచుఁ। బోవుచాడ్పుననో పాండు భూపతనయ ॥ ఉ ॥
శ్రోత్రము జిహ్వనాసికము శోభనగాత్రము దీప్తవిస్ఫుర। న్నేత్ర
మున్మానసంబుఁగడు నేర్పునజీవుఁడు పొందిశబ్దముఖ్య।బాత్రరసం
బుఁదావియును స్పర్శము రూపమునాశ్రయించిత । చ్చిత్రవిచిత్ర
సౌఖ్యములఁ జెందుచునుండును పాండవోత్తమా॥ వ ॥ మఱియు
గుణాన్వితుండగు జీవుండు దేహంబునందుండెవేఱొకదేహం
బున కభిగమించునప్పుడైనను దేహగతుండైన తఱి నన్యో విష
యంబు లనుభవించు వేళనైనను మూఢాత్ములుగానలేరు జ్ఞానచ
క్షుషులైన మహాత్ములు చూచుచుందురు ॥ గీ ॥ యత్నపరులైన
యోగీంద్రులాత్మయందు । సుస్థిరుండగు జీవునిఁజూతురనఘ। య
త్నపరులయ్యు నవిశుద్ధమైనమనము। గలుగువారలు జీవునిఁగాన
లేరు॥ గీ॥ ఏదియాదిత్యగతమైన యిద్ధతేజ । మెద్దిచంద్రునిలోపల
నెసఁగుదీప్తి। యెద్దివైశ్వానరుండు వహించుకాంతి । యనఘయ
దియెల్లనాయదియగుచు నెఱుఁగు॥ గీ॥ భూతధాత్రినధిష్టించి భూ

తసమితిఁ। బరగధరియింపుచుండుదు బలముచేత। రసమయుండై నయట్టి చంద్రముఁడనగుచు। నోషధులకేనొనర్చుదుఁబోషణంబు॥ గీ॥ నేనవైశ్వానరుండనై నిఖిలమైన । భూతసంఘంబుమేనులఁబొసఁగఁజొచ్చి । శౌర్యనిరతిఁబ్రాణాపానసహితవృత్తి । భక్ష్యభోజ్యాదిపచనమేర్పడనొనర్తు॥ వ॥ మఱియు సకలప్రాణిహృదయంబులయందు నంతర్యామిత్వంబున వర్తించువాఁడనేను నావలనఁ బ్రాణులకు స్మృతియును జ్ఞానంబును సంభవిల్లు సర్వవేదంబుల చేత వేద్యుండనైన సర్వవేదాత్మకుండు నేన సర్వసంప్రదాయకంబులకు జ్ఞానంబు నుపదేశించుగురుండు నేన వేదాంతవేద్యుండును నేనయని తెలియుము ॥ గీ ॥ క్షరుఁడునక్షరుఁడనునట్టిసంజ్ఞబోధ। పురుషులిరువురు జగమున భూరితేజ। క్షరుఁడు దేహంబుగా మదిఁజర్చసేయు । మక్షరుఁడు జీవుఁడని చూడుమాత్మలోన॥ గీ॥ వీరలిరువురకంటెను వేఱెయగుచుఁ । బరగుపరమాత్మయనుపేరి పురుషుఁడొకఁడు । మూడులోకంబులందుండి ముఖ్యవృత్తి। నింతయును బాలనముసేయు నీశుఁడతఁడు॥ గీ॥ క్షరుసతిక్రమమెనరింపఁజాలువాఁడు । నక్షరునికంటె నుత్తముఁడైనవాఁడు । గాన లోకంబులందు నాగమములందు । నలరుచుండుదుఁ బురుషోత్తమాహ్వయమున॥ గీ॥ ఎవ్వఁడేనియు సిద్ధమౌ నెఱుకచేత। మత్తమైనట్టి మూఢతమంబుమాని । నన్నుఁబురుషోత్తముని గా మనంబులోన। నెఱుఁగునాతఁడు సర్వజ్ఞుఁడిద్ధచరిత॥ గీ ॥ శ్రీకరంబుగనాచేతఁజెప్పఁబడిన । యిమ్మహాగోప్య మగుశాస్త్రమెవ్వఁడేని। యెఱుఁగునాతఁడు కృతకృత్యుఁడెన్నఁదగిన । బుద్ధిమంతుఁడుహో పాండుభూపతనయ॥

ఇది పురుషోత్తమప్రాప్తియోగంబను పంచదశాధ్యాయము.

---

## షోడశాధ్యాయము.

వ॥ శ్రీభగవంతుండిట్లనియె॥ సీ॥ దేవసంపదచేతఁ దేజరిల్లెడు యోగి భయమించుకయు లేకపరగుచుండుఁ। జిత్తంబుమత్పరాయత్తతవిలసిల్లు జ్ఞానయోగంబున ధ్యానుతుండు। దానధర్మములందు తాత్పర్య శీలుండు నిశ్శంకుడింద్రియనిగ్రహమున। యజనక్రియలయందునతుల ప్రమోదుండు స్వాధ్యాయపఠనభాస్వతతనుండు। తపములందును మిక్కిలి ధన్యపరుఁడు। వక్రభావంబునొందకవన్నెకెక్కు। సకలజనములుఁదనుఁజూచి సన్నుతింపఁ। చారుష శ్రీసమాశ్రయా పాండవేయ॥ వ॥ మఱియునహింసను భావనకుఁబరపీడా వర్జనంబును సత్యంబును గ్రోధరాహిత్యంబును నుదారత్వంబును శాంతియుఁబారుష్యరాహిత్యంబును బరులపైదోషంబుల నాపాదించ కుండుటయు నలోలత్వంబును మార్దవంబును సిగ్గును వ్యర్థక్రియారాహిత్యంబును గలిగియుండు॥ క॥ తేజముక్షమధృతిశౌచం। బాజిమహిూద్ర హింసయడఁగుటగర్వ। త్యాజత్వముసత్సంపద। తేజంబును మనుజునందుఁదిరముగఁజూమీ॥ క॥ అతిమానదర్పభీతులు। నతులితకోపముఁబరుషభయంకరవాచా। లతయునునజ్ఞానంబును। జతురతఁబ్రాపించునసురసంపత్తిమెడక॥ గీ॥ దేవసంపద మోక్షంబు తెరువుఁజూపు। నసుర సంపదనరకంబునందఁజేయు। దేవసంపదఁగలవాఁడవీవుపార్థ। సంశయింపంగవలదు విషాదముననను॥ క॥ దేవాసురగుణయుక్తుల। శ్రీవల్లభుఁడాదిసృష్టిఁజేసెనుజూమీ। దేవగుణమంతచెప్పితి। భావజ్ఞాదైత్యగుణము పరగఁగవినుమా॥ వ॥ మఱియునాసుర సంపదగలవానికి ధర్మంబునందునివృత్తియు నధర్మంబునందుఁబ్రవృత్తియు శౌచంబును నాచారంబును సత్యంబు

నుంగలుగకుంషు ॥ సీ ॥ సకలప్రపంచంబు సత్యంబుగాఁబూచు వేదశాస్త్రంబుల విశ్వసింపఁ । డఖిలజగంబు ధర్మాధర్మ సుప్రతిష్ఠా శూన్యమనిచాలఁజర్చ సేయు । నీలోకమున కెల్లనీశ్వరుండ నఁగలేఁడిదినిశ్చయంబని మదిఁదలంచు । స్త్రీపుంసయుగళంబుస్పృష్టి కెల్లనుగారణంబని మిగులవాదంబుసలుపుఁ । గాంతలకుఁబురుషుల కెల్లఁగలుగునట్టి । కామవిభవంబు దీనికిఁగారణంబు । గాని మఱికారణంబేమిగలుగదనును । దనుజ సంపదగలిగిన మనుజుఁడనఘ ॥ గీ ॥ ఇట్టియజ్ఞానదర్శన మెసఁగనొందు । నల్ప మతిన్యైనయట్టి దుష్టాత్ముఁడుగ్ర । కర్మహారియునైజగ త్క్షయముఁ గోఱకు । నఘుపుజన్మంబునొందువాఁడహితుఁడగుచు ॥ వ ॥ మఱియునద్దురాత్ముండుశక్యంబుగాని కోరికల నాశ్రయించి దంభమాన మదాన్వితుండై మోహనక్షుద్ర దేవతల నారాధించి నిక్షేపాదులఁగోరుచుమద్యమాంస విషయంబులగునపవిత్ర వ్రతంబులనడుపుచుం బ్రవర్తిల్లు ॥ గీ ॥ అపరిమితమైనచింతను నాశ్రయించి । మరణమొందెడువందాఁకమసలుచుండుఁ । గామభోగంబు పరమార్థగతి యటంచు । నిశ్చయంబుగవర్తించునీచనరుఁడు ॥ క ॥ మిక్కిలియాశారజ్జులఁ । జిక్కిమిళితాక్కమరోషచేతస్కుండై । మెక్కుడుగాభోగార్థము । దక్కకయన్యాయమనసు ధనతతిఁగోరున్ ॥ క ॥ ఇదినాకులబ్ధమైనది । యిదినాకుఁబ్రియంబుచాల నిదిగలుగుచు ను। న్నది యిదికాఁగలదుదియని। కొదుకుచు నేప్రొద్దునొమ్ముఁగూర్చుఁగడంకన్ ॥ వ ॥ మఱియునిప్పుడొక్కశత్రుని వధియించితినింక కొందఱి శత్రువులవధియింపవలయును బ్రభుండ నేనభోగియు నేనకృతకృత్యుఁడ నేనయునితలంచు ॥ గీ ॥ ఆఢ్యుఁడను నేన కులవంతుఁడైనవాఁడఁ । నేనమఱినాకు వేరుసమానులె

చట । యజ్ఞమొనరింతు నర్థుల కర్థమిత్తు । సంతసముఁగాంతు ననునునజ్ఞానుఁడగుచు ॥ గీ ॥ బహుళవిషయానుసక్తివిభ్రాంతుఁ డెవఁడు । మోహజాలసమావృతమూఢుఁడెవఁడు । కామభోగసమాసక్తి కలితుఁడెవ్వఁ । డట్టివాఁడుగ్రనరకంబునందుఁజెందు ॥ వ ॥ మఱియుదుష్టాత్మునకుఁదన్నుఁదాఁబొగడు కొనుటయు దాంభికత్వంబున నవిధిపూర్వకంబుగ యజ్ఞంబు సేయుటయుఁగలిగియుండు ॥ గీ ॥ బలముఁగ్రోధంబుదర్పంబుఁబ్రబలకామ । మునునహంకారమునుగల్గియనుదినంబుఁ । దనకునొరులకు నాత్మమైతనరునాకు । ద్వేషియగుననసూయాసమువృత్తినతఁడు ॥ గీ ॥ నాకుద్వేషులునైనట్టినరులఁ బార్థ । వ్యాఘ్రసింహాది యోనులయందుఁబుట్టఁ । జేయుదును సతతంబు నామ్నాయమందు । నశుభకర్ములుఁగ్రూరులునగుటఁజేసి ॥ గీ ॥ ఆసురములైన యోనుల నరయఁబుట్టు । జనులు మూఢాత్ములై జన్మజన్మములను । నన్నుఁబొందంగ లేక యాపన్నులగుచు । నధమ గతిఁబొందుచుందురుదురనఘచరిత ॥ గీ ॥ కామమును లోభమోహము లట్టిగాను । నారకద్వారములు నాత్మనాశకములు । గాననీమూఁడు గుణములఁగట్టువడక । సంచరిలపంగవలయును సజ్జనుండు ॥వ॥ నరకద్వారంబులగు కామక్రోధ లోభంబులు విడిచి నరుండు మోక్షకరంబులైన తపోయోగాది కర్మంబులాచరించి పరమగతింబొందును ॥ గీ ॥ ఎవ్వఁడేనియు శాస్త్రంబులెడలఁద్రోచి । కామరతిని వర్తించిన కష్టజనుఁడు । జ్ఞానసుఖమును మోక్షంబుఁ గానలేక । మహిత సంసారజలరాశిమగ్నుఁడగును ॥ గీ ॥ కాన శాస్త్రంబు ప్రామాణికముగ నెఱిఁగి । చేయవచ్చిన యవియు

నుజేయరాని । యవియుఁదెలియుచు శాస్త్రోక్తమైనయట్టి । క
ర్మములు సేయుచుండుము నిర్మలాత్మ॥

ఇది దైవాసురసంపద్విభాగయోగంబను షోడశాధ్యాయము.



## సప్తదశాధ్యాయము.

వ॥ అనినవిని యర్జునుండిట్లనియె॥ గీ॥ శాస్త్రవిధిలంపటుఁ
డుగాక శ్రద్ధతోడ । నెవ్వఁడేనియు యజనంబులెసఁగఁజేయు ।
నతనికెయ్యదిగతితదీయంపుశ్రద్ధ । సాత్వికియొరాజసియొతమ
స్సంశ్రితయునో॥ వ॥ అనినశ్రీభగవంతుండిట్లనియె ॥గీ॥ శ్రద్ధయన
ఘాత్మత్రివిధమైజరగుచుండుఁ। బూర్వకర్మంబు సంసారభూతమ
గుచుఁ । బ్రథితమైనట్టి సాత్వికిరాజసియును । దామసియునగువి
వరింతుదానినీకు॥ వ॥ వినుముశ్రద్ధసత్వానుసారిణియైన వివేకం
బునుగలిగియుండుఁ; బురుషుండుశ్రద్ధామయుండైశ్రద్ధగలిగవర్తి
ల్లువాఁడుత్తరజన్మంబునను శ్రద్ధగలవాఁడై ప్రవర్తిల్లును॥ఉ॥ దేవ
చయంబు సాత్వికుఁడుదీపితభక్తినుపాస్తిసేయునో । ధీవరయ
క్షరాక్షసతతిందగఁగొల్చును రాజసుండుతాఁ । గావరమొంది
తామసుఁడుకష్టతరంబగు ప్రేతభూతసం । సేవలు సర్వకా
లమును జేయుచునుండును గోర్కితోడుతన్॥ ఉ॥ కామమురా
గముంబలముఁగల్గియహంకృతి దంభయుక్తుఁడై । యేమనుజుండు
శాస్త్రవిధినెంతయుఁదుచ్ఛముగాఁదలంపుచున్ । భూమికిభీకరం
బయిన ఘోరితపంబొనరింపుచుండునా । పామరునాసురక్రియ
లఁబర్వినవానిఁగనిశ్చయింపుమా ॥ గీ॥ తానుదుర్బలుఁడైదేహ
ధారిమిగులఁ । గనుబృథివ్యాదిభూతంబులను గృశంబు । గాఁగ
లంపటమొనరింపఁగన్నవాని । ననఘయాసురనిశ్చయుండనివె

ఋంగు ॥క ॥ ఆహారయజ్ఞతపములు । మోహాగుణవిదూర! దా
నములువివిధములై । దేహతతియందువర్తిలు । నూహింపఁగగు
ణవిభేద మొందినకతనన్ ॥వ॥వినుమాయుస్సత్త్వబలారోగ్యసుఖప్ర
వర్ధనంబులునురసవంతంబులునుస్నిగ్ధంబులును హృద్యంబులునగు
చతుర్విధాహారంబులు సాత్త్వికప్రియంబులు॥సీ॥ మిగులఁజేఁదునకు
ను మెచ్చునీచుండును ఘూరితోషమునొందుఁబులుసునకును । లవ
ణంబు హెచ్చినఁదవిలి వేడుకపడు నత్యుష్ణభోజనంబాహరించు।మి
రియంబుమించిన మిక్కిలి ప్రియమందుఁగోద్రవాదులఁ దగఁగోరు
చుండుఁ । భూరినాసికాపుటంబులఁబొగల్ వెడలించు నావపచ్చ
ళ్లకునలరునెపుడు। మఱియునుఃఖంబుశోకంబు మహితమైన। యా
మమందునఁగల్పించునట్టిభక్ష్య । భోజ్యచోష్యంబులెల్లనింపుగ
భుజించుఁ । బాండవేయ రజోగుణభాజనుండు ॥ ఉ,॥ వండినవె
నక—జామునకు వర్ధితశైత్యకమైనయన్నముల్ । ఖండితసారమైన
యతిగర్హితగంధములై నభక్ష్యముల్।మెండుగఁ జల్దియెంగిలియు
మిక్కిలి దూష్యములైనవస్తువుల్ । పాండుజ తామసావళికిఁబా
త్రములై చనుచుండుభుక్తికిన్ ॥ గీ ॥ యజ్ఞకర్మంబుతనకుఁగా
ర్యంబటంచు । ఫలములేమియుఁగోరని ప్రాజ్ఞతముఁడు । విధి
యుతంబుగఁజేయునావిమలయజ్ఞ । మనఘసాత్త్వికమనుపేరనల
రుచుండు ॥-గీ ॥ ఫలముఁగాంక్షించి మిక్కిలిపరులచేత । నధికుఁ
డనిపించుకొనఁజాలనాశపొడమి । పురుషుఁడొనరించు యజ్ఞంబు
కురుకులేశ । రాజసంబనుపేరటఁజేజరిల్లు ॥ గీ॥ మంత్రములు ద
క్షిణలు లేక మహితులైన । విప్రులకునన్నమిడుటకు వైరవులేని ।
జన్నుడుశ్రద్ధావిహీనుఁడై సలుపునట్టి। యజ్ఞమనఘాత్మ తామసం
బనఁగఁబరగు॥ వ॥ వినుముదేవద్విజగురు ప్రపూజనంబునుశౌచం

బును బ్రహ్మచర్యంబును నహింసయు శారీరంబగుతపంబని చెప్పం
బడును॥ గీ ॥ అభయదంబును సత్యంబునభిహితంబుఁ। బ్రియము
నగు వాక్యమును వేదచయపఠనము । వాచికంపుఁదపంబన వ
సుధ వెలయుఁ । బాండవోత్తమ తెలియుము ప్రజ్ఞ మెఱయ ॥ గీ॥
భావశుద్ధియు నక్రూర భావమునుమ । నఃప్రసాదమువిమలమౌ
నవ్రతంబు । విషయములవల్ల నింద్రియవితతి మగుడఁ । బట్టుట
యు మానసంబనఁబరగుతపము॥ గీ ॥ ఫలమొకింతయుఁ గోరకప
రమమైన । శ్రద్ధతోడుత యోగులుసలుపునట్టి । త్రివిధమైనతపం
బును దివిజరాజ। తనయ సాత్వికమను పేరఁదనరుచుండు ॥ గీ ॥
అన్యులొనరించు పూజలకాసపడుచు । దంభమునఁజేయు తప
ముపృథాతనూజ । రాజసంబను పేరిటఁజేజరిల్లు । నధ్రువంబు
ను జలనంబు నగుచుమిగుల ॥ వ ॥ మఱియుమగ్జనుండు దురాగ్ర
హంబునం దనకుదుఃఖసంపాదకంబును నొరులకు హింసాకరం
బునుగాఁజేయు నభిచారరూపంబగు తపంబు తామసంబనంబర
గుచుండు ॥ క ॥ కాలముదేశముఁ బాత్రముఁ । జాలఁగఁబరికిం
చి వీత సంశయుఁడగుచున్ । మేలిమిఁగను నుపకారికిఁ। దాలిమి
నిడ సాత్వికాఖ్యదానంబయ్యెన్ ॥ గీ ॥ అమరలోక సుఖంబుపై
నాసనైనఁ । గోఱిప్రత్యుపకారంబు కోఱకునైనఁ । క్లేశము
ననిచ్చు దానంబుకీర్తిధుర్య । రాజసంబను పేర విభ్రాజితంబు॥గీ॥
దుష్టకాలంబునందును దుష్టదేశ । మున నపాత్రులకిచ్చుట వినుత
దేశ। కాలపాత్రంబు లాదవినఁగడునవజ్ఞ। యడర నీకుంట తామ
సమనఁగఁబడును ॥ వ ॥ వినుము మఱియు మంత్రంబునందుఁబ్రణ
వాదిలో నొకభాగంబు పరిత్యజించి మంత్రాత్మకంబయిన చతు
ర్వింశత్యక్షరంబులయందుఁబ్రణవాది వర్ణత్రయంబుపరబ్రహ్మనా

మ నిర్దేశంబయ్యెనదియు బ్రాహ్మణులకు యజ్ఞంబులకు వేదంబులకుఁ బూర్వంబునందుఁ జేయంబడియుండు॥ క ॥ ప్రణవోచ్చారణపరులై। గణుతింపఁగ యజ్ఞదానఘనతపములయం। దణుమాత్రంబును వికలత। గుణభరితా పొందనీరు క్షోణీదివిజుల్ ॥వ॥ మఱియు నాప్రణవంబు తరువాతి రెండవవర్ణంబునుచ్చరించి మోక్షకాంక్షులు ఫలత్యాగులునునైన మహాత్ములు వివిధంబులైనయజ్ఞదానాది క్రియలు సేయుచుండుదురు ॥ గీ ॥ దానిఁబాసిన వర్ణంబుధన్యచరిత। సాధుభావంబునందును సత్యమునను। మాంగళీకర్మములయందు మహితముగను। సంప్రయోగింపఁబడు సూరిజనముచేత॥ వ॥ మఱియు యజ్ఞతపోదానంబులయందావర్ణంబు చెప్పంబడునే తద్వర్ణ త్రయనామకుండగు వాసుదేవుండు ఫలంబుగాఁ గలిగిన పూజోపహార గృహాంగణ పరిమార్జనోపలేపనరంగవల్లికాదులును దత్సిద్ధికొఱకైనయుద్యానశాలి క్షేత్రధనార్జనాది విషయకర్మంబును నాతృతీయవర్ణంబెయని చెప్పంబడు వేతద్వర్ణత్రయాత్మకంబయిన పరబ్రహ్మంబు కీర్తింపబ్రాహ్మణుండు చేయుకర్మంబులకు సాద్గుణ్యంబు సంపాదిల్లును॥ గీ॥ శ్రద్ధసేయని హెూమంబు జపముఁదపము। దానమును మఱియన్యసత్కర్మచయము। నిహపరంబుల సౌఖ్యంబులియ్యలేవు। శ్రద్ధకర్తవ్య మనఘాత్మ సర్వమునకు॥

ఇది శ్రద్ధాత్రయవిభాగంబను సప్తదశాధ్యాయము.

---

## అష్టాదశాధ్యాయము.

వ ॥ అనినవిని యర్జునుండిట్లనియె ॥ క ॥ సన్యాసత్యాగంబుల । ధన్యప్రదత్వంబునాత్మఁదగనెఱుఁగఁగఁద। ద్వి

న్యస్త చిత్తుఁడైతిని । మాన్యస్థితి రాకుఁ జెప్పుమా వేద్వేరక ॥
వ ॥ అనినవిని శ్రీభగవంతుండిట్లనియెఁ బుత్రధనాదివస్తువులు
ను బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థాశ్రమంబులకు నియమించి
న వేదోక్తకర్మంబులును శిఖాయజ్ఞోపవీతంబులును బరిత్యజిం
చిన పరివ్రాజకకర్మంబు సన్యాసంబని విజ్ఞానులెఱుంగుదురు.
ఆశ్రమత్రయంబులవసియించి వేదోక్త కర్మంబులుగావించిఫలం
బులు గోరక వాసుదేవార్పణంబు సేయుట త్యాగంబని విజ్ఞాన
చతురుస్సు లెఱుంగుదురు ॥ క ॥ హింసాదికరములనుచుఁ బ్ర । శం
సించరుకర్మములను సాంఖ్యులుభువిలో। హింసాకరమ్ములయినఁ బ్ర।
శంసింతురు బుధులు దానసవనతపంబుల్॥ గీ॥ త్యాగవిషయము
నయథార్థమ్ముగామద్వి చెఃప్రసక్తివినుమసంశయతను। మూఁడువి
ధములగుచు మొనసివర్తిల్లుఁద। త్యాగమహిమవీతరాగహృదయ॥
వ॥ మఱియు విజ్ఞానులు యజ్ఞదానతపః కర్మంబులు నవశ్యకర్త
వ్యంబులుగా నాచరింతురు॥క॥కావున వేదోక్తంబులు। గావింపుచు
ఫలములందు గతసంగుండై। పావనుఁడై వర్తిల్లుట। ధీవరనామత
ముగాఁగ దెలియుము మదిలోన్॥ గీ ॥ అరయగృహమేధిమో
హంబునధిగమించి । నిత్యకర్మంబుచేయక నిలిచెనేని । యట్టిత్యా
గంబు తామసాహ్వాయమనొంది । భూమిఁబ్రఖ్యాతమగు సము
ద్ధామచరిత ॥ క ॥ కాయక్లేశభరంబున । నాయాసభయంబొదవ
చ్చు ననికర్మంబుల్ । సేయకవిడిచినత్యాగం । బాయతముగరా
జసాఖ్యమది ఫలమిడునే ॥ గీ ॥ నిత్యకర్మంబులెల్లను నిర్వహించి।
ఫలముసంగ్రబుఁగోరని భద్రమైన । త్యాగమనఘాత్మ సాత్వికంబ
ని ధరిత్రిఁ । బెంపునింపును శాత్రవభీమశౌర్య ॥ వ ॥ సాత్వికత్యా
గసంపన్నుండగువాఁడు సుఖదుఃఖకరంబులయిన నిత్యకర్మంబుల

యందు స్నేహద్వేషంబులువర్జించి స్థిరబుద్ధియు వైష్ణవధర్మప
రుండును నై భ్రష్టత్వంబు నొందక విచ్ఛిన్నసంశయుండై ప్రవర్తి
ల్లు॥ గీ॥ దేహధారులు కర్మసందోహమెల్ల । సన్యసింపసమర్థులై
చనరుపార్థ । కర్మములుచేసి ఫలసంగకాంక్షమాని । హరికి నొ
ప్పించుటయెత్యాగమనంగనొప్పు॥ గీ॥ కర్మములుచేసి త్యాగంబు
గానలేక । కడగుసత్వరజస్తమకర్మపరులు । నాకమును మర్త్య
లోకంబు నారకంబుఁ । జెందుదురుగాని సన్యాసిచెందఁడనఘ॥
గీ॥ కర్మసంసిద్ధులకు నెల్లఁగారణంబు । లైదుప్రాధాన్య సంపద
నతిశయిల్లు । సాంఖ్య వేదాంతముల సవిస్తరముగాఁగఁ। జెప్పఁ
బడెనవి చెప్పెదఁజెలఁగవినుము॥ వ ॥ అధిష్ఠానంబనందగు శరీరం
బును గర్తయనందగు నహంకారంబును గరణంబులనందగుచక్షు
శ్శ్రోత్రాదికంబును వివిధచేష్టలనందగు ప్రాణాపానాదివ్యాపా
రంబును సూర్యాద్యధిదైవికంబగు దైవంబును నీయైదును గార
ణంబులు ॥ గీ॥ వాఙ్మనో దేహములచేత వరుసగాను । గర్మము
లు సేయునుద్యోగకలితులకును । న్యాయమైనను విపరీతమైనఁ
జేయుఁ । గలుగఁగాఁదగు నీయైదుకారణములు॥వ॥కర్మకారణము
లైదును నిట్లుండఁడా నేకర్తయని భావించుకొను దుర్మతి యాత్మ
తత్త్వంబుఁజూడన సమర్థుండైనశించు మఱియు నహంకృతభావం
బులేక యెవ్వనిబుద్ధియలిప్తంబయియుండు నతండు హింసలుగా
వించియు హింసాఫలబద్ధుండుగాకయుండు॥గీ॥ తెలియఁదగనది తె
లివిచేఁ దెలియువాఁడు । కర్మసంతతికుపదేశపరుఁడుపార్థ। కరణ
మును గర్మమునుగర్తకర్మసంగ్ర। హంబునకునివి హేతువులగుచు
నుండు॥గీ॥జ్ఞానమునుగర్మమును గర్త సత్వముఖ్య।గుణవిభేదవశం
బునగణుతికెక్కు।సాంఖ్యశాస్త్రంబునందును సమ్మతముగఁ। జెప్పఁ
బడియెను జెప్పెదఁజెలఁగవినుము ॥ వ ॥ మఱియు విభక్తంబులగు

బ్రహ్మాదిపిపీలికాంత జంతువుల యందును సమత్వంబును బ్రహ్మాభా
వంబు నెవనిచేతంజూడంబడునట్టి జ్ఞానంబు సాత్వికంబననొప్పు॥
గీ॥ సౌఖ్యదుఃఖంబులందును సక్తమగుచు। జీవజాలంబుతలపో
యు భావనంబు। రాజసజ్ఞానమనుచును భూజనంబు।గణుతి సేయు
నుసుజ్ఞానఘనవివేక॥వ॥పరబ్రహ్మంబదృశంబై దేహంబందును బ్రతి
మాదులయందు సక్తంబయి యతథ్యంబును హేతురహితంబును
నయియల్పఫలకాంక్షిత్వంబు గలుగుట తామసజ్ఞానంబు॥ గీ॥ కా
మకాంక్షులచేనైన గాఢమగుచుఁ। దగునహంకారముననైనఁదను
వుచాల। దుఃఖమందంగఁ జేయునాతుచ్ఛకర్మ। మనఘరాజసమ
ను పేరనమరుచుండు॥ గీ॥ నియతమగుదానిమిక్కిలి నెగడఁజేసి।
రాగమునద్వేషమునఁ జాలరతుఁడుగాక। ఫలమునంగంబునొల్ల
క పాఱద్రోచి। సరసుఁడగువానికార్యంబు సాత్వికంబు॥ వ॥
మఱియునాగామి శుభాశుభంబులు ద్రవ్యక్షయంబులుఁ బరపీడ
యు స్వసామర్థ్యంబును నహంకారంబుచేత విచారింపకచేయు
నది తామసకర్మంబు॥ గీ॥ ముక్తసంగుఁడహంకారమోచనుఁడు।
ధృతిమహోత్సాహముల యందుఁ దెలివికాఁడు। కర్మసిద్ధిననిద్ధి
నిగలఁకపడఁడు। సత్వసంయుక్తుఁడగు కర్తసజ్జనుండు॥ గీ॥ కర్మ
ఫలకాంక్షియైరాగ కలితుఁడగుచు। నశుచిలుబ్ధతహింసయునడ
రనుండు। హర్షశోకాన్వితుండగునట్టికర్త। రాజసుఁడను పేరి
టఁదేజరిల్లు॥ వ॥ మఱియు నానావిధుండును వివేకశూన్యుండు
ను నవినీతుండునునత్యంత కుశీలుండును బరావమానియు నలసుం
డును మదకర్ముండును దుఃఖశీలుండునునగు కర్త తామసుండనంబ
రగు॥ గీ॥ బుద్ధియును ధైర్యమును గుణంబులవలనను। మూఁడుతె
ఱఁగుల వర్తిల్లుమోహదూర। వేరువేర ప్రపంచించి వెలయనేను॥

జెప్పెదను వినుచిత్తంబుఁ జెదరనీక॥వ॥ ధర్మంబునందుఁ బ్రవృత్తియు నధర్మంబునందు నివృత్తియు నిది సేయఁదగదనియు నిది చేయఁదగుననియు నిది భయం బభయంబిది బంధంబిది మోక్షంబిది యని యెఱుంగుబుద్ధి సాత్వికంబనంబరగు॥ క ॥ ధర్మాధర్మవిచారము। నిర్మలకార్యంబుఁగార్యవిచయము నెఱుఁగక। పేర్మివహించి నబుద్ధిని। ధర్మసుతా నుజ తలంచుధర రాజసిగాఁ ॥ గీ ॥ దుష్టధర్మంబు కేవల శిష్టమనుచు। సర్వకర్మంబు విపరీతసరణిఁ జేయు। నట్టిదుష్టాత్మకుని బుద్ధి యుహరహంబు। తామసియనఁగ భువిలో నందనరుచుండు ॥ గీ ॥ ఎవ్వఁడేనియు ధృతిచేత నింద్రియంబుల। మానసప్రాణములఁజాల మట్టుపఱిచి। యోగమవ్యభిచారతనొప్పు నెవ్వఁ। డతనిధైర్యంబు సాత్వికంబనఁగఁబరగు ॥ గీ ॥ ధర్మకామార్థముల ఫలతత్పరతను। ధరణిఁగాంచు నాతనిధైర్యము నఘ। రాజసంబను పేరిటఁజేజఁత్లు। జగతిలోపలనిది మెట్టినమ్మతాలకు ॥ గీ ॥ ధర్మకామచయంబులు ధన్యవృత్తిఁ। జేయు కాలస్యనిద్రాది చింతఁబొదలు। నట్టిపురుషుని ధైర్యమోయనఘచరిత। తామసంబను పేరిటందనరుచుండు ॥ వ ॥ మఱియును ఖంబుత్రివిధంబై ప్రవర్తిల్లునందు సాత్వికసుఖంబభ్యాసవశంబున సంతోషకరంబై దుఃఖావహంబై నెలయు వెండియు ॥ గీ ॥ విషమువలెనుండు నభ్యాసవేళయందు। నభ్యసించిన నమృతసామ్యంబునొందు। నాత్మబుద్ధి ప్రసాదజన్యంబు వినుము। సాత్వికాహ్వాయ సౌఖ్యంబు సాధువర్య॥గీ॥ మహిత విషయేంద్రియాది సమాగమంబు। నమృత సదృశమై వర్తిల్లు నాదియందు। విషమువలె నుండు బరిణామ వేళయందు। నట్టి సౌఖ్యంబు రాజసంబనఁగఁబరగు॥ వ॥ మఱియు మొదలబంధకంబయ్యును నాత్మకు మోహకరంబ

య్యును నిద్రాలస్య ప్రమాదజన్యంబయ్యును బరగుసుఖంబు తా
మసంబననొప్పుచుండు॥గీ॥ప్రకృతిజములైనగుణములుపార్థవిడువ।
నమరులకు మానవాళికినలవిగాదు। త్రిగుణములఁబాసినట్టి యుద్ధి
ప్తసత్వ। మనఘ మఱిలేదుదివియందునవనియందు॥ గీ॥ విప్రులకు
క్షత్రియులకును విజ్ఞనులకు । శూద్రులకుఁ గర్మములు వేఱుచూ
పఁబడియె। ననఘసద్భావజన్మంబులైనయట్టి। విప్రగణములచేత
నివిశ్వమునను॥ వ॥ శమంబును బాహ్యేంద్రియనిగ్రహంబును వై
ష్ణవ వ్రతంబులచేత శరీరంబులఁ గృశింపఁజేయుటయు బాహ్యా
భ్యంతర శౌచంబును క్షమమును నవక్రత్వంబును శాస్త్రజ్ఞానం
బును నారాయణావలోకంబును విష్ణువు లోకనంబునం గలఁడ
ను బుద్ధియు నివి బ్రాహ్మణులకు స్వభావకర్మంబులు॥గీ॥ శౌర్యతే
జఃకుశలతలు ధైర్యగుణము। యుద్ధమందును నోడకయుండుటయు
ను। దానమిచ్చుట నియమిత ధర్మపరత । క్షత్రియునకు స్వభావ
సత్కర్మచయము॥ గీ॥ కృషియు గోరక్ష సద్ధర్మవిషయమైన। క్ర
యము విక్రయమునునను కర్మవితతి । వైశ్యునకు సహజంబులై
వసుధఁదనరు। శూద్రకర్మంబు త్రైవర్ణ్య శుద్ధసేవ ॥ క ॥ తమత
మకర్మంబులమెడ । భ్రమయకవర్తించి సిద్ధిఁబడయుదురునరుల్।
విమలతరసిద్ధిఁబొందెడు । క్రమముగ్ దెలిపెదనునీకుఁ గౌరవము
ఖ్యా॥ గీ ॥ ఏపురుషువల్ల భూతప్రవృత్తిదనరు । నెవ్వఁడంతట
వ్యాపించియెసఁగుచుండు । నతనిఁదమతమ సత్కర్మవితతిచేతఁ।
బూజచేసినరుల్సిద్ధిఁబొందుచుండ్రు॥ వ ॥ వినుమర్జునా! భిక్షాన్న
ప్రాశనంబును నహింసాపరంబునునై సుగుణంబగు బ్రాహ్మణ క
ర్మంబుకంటె బంధువధాదికంబగు క్షత్రియకర్మంబు శ్రేయస్క
రంబది యెట్లన్నను వర్ణాశ్రమపరులు వేదోక్తకర్మంబులుచేసి కిల్బి

షంబుల నొందరుగావున ॥ గీ ॥ సహజకర్మంబులనఘాత్మ సజ్జను
లకు। విడువఁగా రాదు దోషంబుతోడరియున్న। కర్మమెల్లను దో
షసంకలితమెపుడు। నగ్ని ధూమావృత స్థితినలరినట్లు॥గీ ॥ సకల క
ర్మంబులందు నాసక్తిలేక । నిస్పృహుండునహంకారనిర్గతుండు।
నైనపురుషుండు కర్మసన్యాసపరత । విష్ణుఁడై కార్యసిద్ధిచే వి
మలుఁడగును ॥ గీ ॥ అనఘసన్యాససిద్ధిచే నలరుచుండి । బ్రహ్మ
మొందెడు మార్గంబుఁబరగనీకు। నెఱుఁగఁజెప్పెద సంక్షేపమెసఁ
గఁబార్థ। జ్ఞాననిష్ఠాపరత్వంబు మానుగాను॥ గీ॥ శుద్ధబుద్ధివియోగ
సంసిద్ధినొంది। ధైర్యమున దేహసంచార శౌర్యముడిపి । యింద్రి
యంబుల కాంక్షలనెడలఁద్రోచి । రాగవిద్వేషముల ననురాగిగా
క॥ గీ॥ విమలతరదేశములయందు వెలయనిలిచి। నియతవాకాయ
య చిత్తతసర్వహించి । ధ్యానయోగంబులఘ్వాశితయునుగలిగి।
యధికవైరాగ్యమహిమనుపాశ్రయించి ॥ వ ॥ మఱియుఁదావిర
క్తుండై యహంకారంబును దర్పంబును గామంబును గ్రోధంబును
గృహదారాది పరిగ్రహంబును మమకారంబును దురాగ్రహంబు
ను విసర్జించి బ్రహ్మంబునొందును॥ గీ॥ బ్రహ్మభావంబునొందు ప్ర
సన్నచిత్తుఁ। డనఘశోకంబుఁగాంక్షయునందకుండు। సకలభూతం
బులందును సమతఁదాల్చు। నాదుమహనీయభక్తియు నాటియుం
డు॥ వ ॥ సర్వవ్యాపియు సచ్చిదానంద విగ్రహుండునుగాననన్నుఁ
బరమభక్తిచే నెఱింగి తదజ్ఞాన పరిసమాప్తికాలంబున నతఁడు
నన్నుంబొందు॥ గీ॥ నన్నయాశ్రయణీయుఁగానమ్మిమదిని। నిత్యనై
మిత్తికంబులు నిర్వహించి। తనరునాతఁడు మత్ప్రసాదంబువలన।
శాశ్వతంబగు పదమును సంగ్రహించు॥ గీ॥ పార్థ కర్మఫలంబులు
పరఁగమదిని। నాకునర్పణఁగావించి యేకనిష్ఠ। బరగుతత్పరచిత్త

తద్భావములకు। బుద్ధియోగంబు సతతంబుఁబొందుపఱుచు ॥ గీ ॥ నీదుచిత్తంబునాయందుఁ బాదుకొనినఁ। బొసఁగమత్ప్రసాదంబుచే నెల్లపాపములను । జేయుచుఁదాఁటెదవు చెడుమతి నీవె॥ మదినహంకారమునఁజాలమూఢకోర్కి। వినక యుండిన భ్రష్టత్వమనుగమించు॥ గీ ॥ మనమహంకారమునఁజాల మగ్నముగను। యుద్ధమొనరింపనను బుద్ధినుండితేని। యస్వతంత్రుఁ డవగునిన్నునడరి ప్రకృతి । యుద్ధమొనరింపఁగాఁజేయకుండుటెట్లు॥ గీ॥ క్షత్రకర్మనిబద్ధతచాలఁగలిగి । యుద్ధమొనరించనను దుష్ట బుద్ధినుండి। తేని నిజకర్మహేతతంత్రుఁడైననిన్నుఁ । గర్మమే తోడు కొనివచ్చుఁ గయ్యమునకు॥ వ ॥ వినుమర్జునా! వాసుదేవ పరబ్ర హ్మంబు సకలభూత హృదయస్థానంబుల నిలిచి తనమాయచే నాటకుండు బొమ్మలనాడించు చందంబున జగంబుల నటింపంజే యుచుండు॥ గీ॥ సత్వభావననతనిని శరణమొందుఁ। దత్ప్రసాదం బువలనను ధర్మచరిత । శాశ్వతంబయి పరమగు శాంతిగలుగు । వైష్ణవస్థానమొందు నిర్వక్రముగను॥వ॥ పార్థ! యశేషజ్ఞానసంప న్నంబయ్యును సకలశాస్త్రరాజజన్యంబును గోప్యంబునకు గో ప్యంబునునై పరగు గీతాశాస్త్రంబు నేనీకుఁజెప్పితినింతయు విమ ర్శించియథోచితం బాచరింపుము॥ క॥ ఇదిగాక గోప్యమొకటి। సదయాగ్రణివగుటనీకు సన్ముదమొదవన్ । బదిలముగఁజెప్పెదనువి ను। సదమలమతినాకు నిష్టసఖుఁడవగుటన్॥ గీ॥మన్మనస్కుఁడగు ము మద్భక్తుఁడవుగమ్ము। నన్నుఁబూజసేయు నాకుమ్రొక్కు। మ స్మదీయపదమునందువర్తిల్లెదు । సఖుఁడవనుచుఁ బ్రీతిసలిపినాఁడ॥ వ॥ వినుమర్జునా! భవదీయకులోచిత ధర్మంబులాచరించి నిర్భ యుండవై యన్యదేవతాభజనంబు మాని నన్నొకనిని శరణంబు బొంది తేని నిన్ను సర్వపాపంబులవలన ముక్తునింజేసెద నని పలికె

యు శోకింపకు విష్ణుభక్తుండై హృదయంబునందునఖండదర్శనం
బున నారాయణావలోకనంబుంజేసిన యోగీశ్వరునకు జ్ఞానంబు
వలనఁ గర్మపరిత్యాగంబుచేసిన దోషంబులేదు॥ గీ ॥ ఇమ్మహాశా
స్త్రముపదేశమియ్యవలదు । భక్తిహీనునకును గర్మవిహీనునకు
ను। నన్ను దూషించు వానికీనాకుగర్వ। మునను శుశ్రూషచేయ
ని మూఢునకును॥ గీ॥ ఇమ్మహాశాస్త్రరాజంబునెవ్వఁడేని । దెలి
య భక్తులకును నుపదేశమిచ్చు । వానికంటెను బ్రియుఁడును వ
ర్తమాన। భావికాలంబులందలి వాఁడులేఁడు॥ గీ ॥ మనల సంవా
దమైన యీ మహితశాస్త్ర। మనుదినంబును బఠియించు మహిత
యశుఁడు। జ్ఞానయజ్ఞంబునను నన్నుఁబూనికొల్చి। మత్ప్రసాదం
బుఁగాంచు సమ్మదముతోడ॥ గీ ॥ మఱియు శ్రద్ధానసూయల మ
హితుఁడగుచు । దీనివినియెడు సజ్జనమానితుండు । విష్ణుభక్తులు
చెందెడు విమలపదముఁ । బ్రకృతివలన విముక్తుఁడై పరగఁగాం
చు॥ గీ॥ ఈపరమగోప్యమగు శాస్త్రమింతవట్టు। ననఘుమేకాగ్ర
చిత్తుఁడవగుచువింటి। దీననజ్ఞానజన్యమై తేజరిల్లు । మోహమెడలె
నె చెప్పు సందేహపడక॥ వ॥ అనినవిని యర్జునుండిట్లనియె॥ గీ॥ నీ
ప్రసాదంబువలన నోనిర్మలాత్మ । మన్మనోవీధి సందేహమహిమ
తొలఁగె । మోహమెడలెను జ్ఞానసంప్రాప్తినొంది । శిరమునను
దాల్తుమీయాజ్ఞ సిద్ధముగను॥ వ ॥ అని పలికెనని శ్రీకృష్ణార్జునుల
సంవాదంబు సంజయుండు ధృతరాష్ట్రునకెఱింగించి మఱియుని
ట్లనియె॥ గీ॥ అఖిలలోకంబులందుఁ బూజార్హమైన। వాసుదేవా
ర్జునోక్తి సంవాదమేను। వినఁగఁగంటిని ధృతరాష్ట్రవిభువతంస।
యద్భుతమురోమహర్షంబు నావహిల్లె ॥ వ ॥ యోగీశ్వరుండగు
శ్రీకృష్ణుండు సాక్షాత్కారంబునఁదాఁ జెప్పిన యిప్పరమయోగ

శాస్త్రంబు శ్రీ వేదవ్యాస వరప్రసాదంబువలనవింటి॥ గీ॥ వెలయుఁ కృష్ణార్జునులచేత వినుతమగుచుఁ। పుణ్యమును నద్భుతంబగు భూరిశాస్త్రి। మనసు తలపోసి తలపోసియాత్మలోన। సన్నుతామోదభరమందుచున్నవాఁడ॥ గీ॥ అర్జునుఁడు చూచినట్టి యాయబ్జనాభు। విశ్వరూపముఁదలపోసి విస్మయమున। రోమహర్షంబునొందుదుఁబ్రేమతోడ। రాజితైశ్వర్య ధృతరాష్ట్రరాజవర్య॥ ఉ॥ ఎక్కడనుండు యోగివిభుఁడీశ్వరుఁడా కమలామనోహరుం। డెక్కడ ధన్వియై చెలఁగు సిద్ధచరిత్రుఁడు పార్థుఁడెన్నఁగా। నక్కడ లక్ష్మి యుంజయము నద్భుతసంపదనీతియుం గడున్। వెక్కసమై వసించుఁ బృథివీవర నిశ్చయమెంతయున్ మహిన్॥

గద్య.

ఇది, శ్రీసకలసుకవిజన సేవాపరాయణ, శ్రీమద్వాసుదేవ ద్వాదశాక్షరీ మంత్రరాజ సిద్ధయోగ విద్యావిశారద, శ్రీనారదాదిగురుపరంపరావాప్త శ్రీ విష్ణుస్వామి సాంప్రదాయిక ప్రతిష్ఠాపనాచార్యగురుకులతిలక యోగీంద్రచూడామణి శ్రీనృసింహదేవ గురువరేణ్య శ్రీపాదపద్మారాధక, వేముగంటి పురనివాస, ఆపస్తంబసూత్ర, హారితసగోత్ర, గాయమాంబా గర్భసంజాత, నాగోజీపండితపుత్ర, దత్తోజీపండిత ప్రణీతంబైన శ్రీ కృష్ణార్జున సంవాదంబను భగవద్గీతా యోగశాస్త్రంబునందు సకలోపనిషదర్థ ప్రతిపాదక సర్వశాస్త్ర తత్త్వనిరూపణ దర్శనయోగంబనునది సర్వంబును నష్టాదశాధ్యాయము.

సంపూర్ణము.

